# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 2 | రాజమహేంద్రవరము 1-5-1979 | సంచిక 13

—* ఈ సంచికలో *—


1) పోతన భాగవతము - ఒక పరిశీలన.

2) గ్రీష్మాటోపము. (పద్య)

3) 'కవికొండలవారి' ప్రకృతి గీతములు - ఒక పరిశీలన.

4) కన్నీళ్ళు. (పద్య)

5) తిలక్ కవితలు - సంప్రదాయపు చాయలు.

6) వేసవి వర్ణన - శ్రీకృష్ణదేవరాయలు. రఘునాథనాయలు.

7) వాగ్దేవి. (పద్య)

8) గ్రంథసమాలోచన.

ఎ) శ్రీ వాల్మీకి రామాయణము.

బి) దీనరక్షక శతకము.

9) అదృష్టము, (పద్య)

10) వసంతగీత. (పద్య)

11) వలపు నెత్తురు. (పద్య)

12) ఈపక్షంలో.


16—5—79 సంచికలో విశ్వశ్రేయః కావ్యం, అతిథి సత్కార కథనము మొదలగునవి ఉంటాయి.

—* 1, 16 తేదీలలో ప్రచురింపబడును *—

చందా

సంవత్సరమునకు రు 10-00.

అర్ధసంవత్సరమునకు రు 5-50.

విడిప్రతి 50 పై.

# పోతన భాగవతము - ఒక పరిశీలన

శ్రీ డా. నేతి అనంతరామశాస్త్రి, ఎం.ఏ.,పిహెచ్.డి.



'నిగమములు వేయుఁ జదివిన
సుగమంబులు గావుముక్తిసుభగత్వంబుల్
సుగమంబు భాగవత మను
నిగమంబు పఠింప ముక్తినివసనము బుధా'

భారతదేశమున భారతరామాయణములకు తుల్యముగా ప్రచారముండుగల యుద్గ్రంథము భాగవతము. ఇది భగవంతుడగు శ్రీకృష్ణుని చరిత్రము. శ్రీకృష్ణలీలలన్నియు నిందు వర్ణితములు. దేవుని మహిమలను తెలుపుటకు నిందు ధ్రువ,కుచేలాది భాగవతుల చరిత్ర లెన్నియో కలవు. అందుచే దీనికి భాగవత మను నామము సార్థకము.

పదునెనిమిది పురాణములలో భాగవతము ప్రసిద్ధమైనది. భక్తశిఖామణుల చరిత్ర, పారమార్థిక చింతనమునే యిందులకు కారణములు. ఇట్టి భాగవత గ్రంథము తెలుగువారి సంపదగ చేసినవాఁడు భక్తకవి పోతన. భాగవతాంధ్రీకరణము బమ్మెరపోతనవంటి మహాభక్తమూర్తి చేతిలో బడుట తెలుగుభాష చేసికొన్న పూజ. భక్తిమాహాత్మ్యప్రతిపాదక మగు నీగ్రంథమును మహాభక్త శిఖామణి యగు పోతన తెనిగించి తనజన్మమును మాత్రమే ధన్యముచేసికొనలేదు. తెలుగుభాష జన్మమును, ,తెలుగువారి జన్మములనుకూడ ధన్యము నొనర్చినాడు.

ఇదిభక్తిజ్ఞానములకు ఆటపట్టు. అష్టాదశపురాణ రహస్యార్థములును, వేదాంత గ్రంథ ప్రతిపాద్యములైన భగవద్గుణములును మిక్కిలినిగూఢములు. వానిని తేట సనెంచి వ్యాఖ్యానించుట వలనను, యు భగవద్భక్త్యతిశయమున దేవుని ుణములను విశేషముగా వర్ణించుట వల ను, తన అనవద్యకవిత్వ విద్యాస్వాతంత్ర్యము వలనను ఆంధ్ర భాగవతము సంస్కృతభాగవతమందలి 2200 శ్లోకముల కన్న 8 వేలగ్రంథసంఖ్యకు అధికంబయ్యెను.

ఈ ఆంధ్రీకరణములలో పోతనకు నచ్చినది కవిత్రయము వారి ఆంధ్రీకరణ పద్ధతియు వారికవిత్వమునే.

"ఒనరన్ నన్నయ తిక్కనాదికవు లీ
యుర్విం బురాణావళుల్
దెనుగుం జేయుచు మత్పురాకృతశుభా
ధిక్యంబుదా నెట్టిదో
తెనుగుం జేయరు మున్ను భాగవతము
దీని దెనింగించియు
జనసంబున్ సఫలంబు చేసెద పున
ర్జన్మంబు లేకుండగన్"

ఈ ప్రయోజనము ఒండొకగ్రంథము నాంధ్రీకరించుటచేత నొనగూడదు.

పోతన తనసంస్కారముల కనువయిన కావ్యమునే నిర్ణయించుకొనినాడు. ప్రాపంచిక భోగములుకాని, ఐహికాడంబరములుకాని ఆతనిలక్ష్యములు కావు. అయినచో తక్కిన కవులవలె రాజులనో, రప్పలనో ఆశ్రయించి వానినిద్ధిని బొందెడు వాడేకదా! కావుననే శ్రీరామచంద్రునకు తప్ప బరునకు తనకృతి నీయ నంగీకరింపలేదు.

కవిత్రయమువారి తరువాత పోతన ప్రజాదరణమును అధికముగా పొందిన కవివతంసుడు. పోతన విద్యాగురువు లెవ్వరో తెలియదు. "చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ" అన్నట్లు సకలరహస్యము లాయనకు కరతలామలకములని భాగవతము చెప్పుచున్నది. అంతేకాక పరమేశ్వరుని కరుణచేత తనకు కవిత్వ మలవడినట్లు తన భాగవతములో చెప్పుకొనెను.

"అతి రహస్యమైన హరిజన్మకథనంబు
మనుజు డెవ్వడేని మాపురేపు
చాలభక్తితోడ జదువ దా సంసార
దుఃఖరాశిబాసి తొలగిపోవు"

హరి పరములగు వివిధరూపములచేతను, అనంతనామముల చేతను, భగవదనుభూతిని కలిగించి యతీంద్రియ మగునాత్మజ్ఞానము నొడగూర్చుట భాగవత హృదయము. హరినామ స్తుతి చేయు కావ్యము బంగారు కమలములతో విరాజిల్లు మానస సరోవరము వంటి దనియు, హరినామ స్తుతిలేని కావ్యము విచిత్రార్థములు కలదయ్యు పాపపు గొయ్యి వంటి దనియు నీమహాకవి ఉద్బోధించెను.

పోతనామాత్యుడు ఒక కవితానిర్మాణ దక్షుడు. అతడు నిరాడంబరమైన కర్షక కవి. ఒకచేతకలము, ఒకచేత హలము పట్టి "మందారమకరంద మాధుర్య" జ్ఞానరాసుల, ధాన్యరాసుల బండించిన సవ్యసాచి ఆంధ్రజాతి కత డిచ్చిపోయిన భాగవతము అమృతభాండము. చిత్తమును భక్తిభావభరితము నొనర్పజాలు పదసన్నివేశ ముక్కయాంధ్రభాగవత కవితలోనే యిమిడియున్నది. భాగవతము నందెల్ల మకుటాయమానమైన 'దశమస్కంధము'న పోతన తనఅనన్యభక్తిని, ఉద్రేకమును చూపినాడు. ఇందలి పాత్రలలో కవి ఐక్యమై పోయినాడు.

"దశమస్కంధః భాగవతస్యజీవితమ్"- అన్నట్లు నిగూఢతత్వ స్ఫురణముకల కథాబద్ధమైన భక్తి దశమములో కరడు గట్టినది. భాగవత మాహాత్మ్యక, ధర్మమార్గ ప్రదర్శకమై మానవజీవితమును తరింపచేయు భక్తకల్పద్రుమము. భగవానునకు భాగవతులకు నడుమ భాగవతము భక్తిపథము.

శ్రీకృష్ణజననము, బాల్యక్రీడలు, కంసవధము, రుక్మిణీ కల్యాణము, కుచేలోపాఖ్యానము, నరకాసురవధమున్నగు ననేక విషయము లీదశమస్కంధమున మనోహరముగ వర్ణింపబడి బడినవి. భాగవతకర్త దివ్యనాయకుడగు శ్రీకృష్ణుని తనకావ్యమున నాయక రత్నముగా నొనర్చుకొని బహుభంగులుగా నాతని దివ్యావతార లీలలను వర్ణించి తాను ధన్యుడగుటయేకాక, శ్రోతలను, పఠితలను కూడ ధన్యుల నొనర్చినాడు. శ్రీరామచంద్రు డుత్తమ నాయకుడైనను అతనిలో దివ్యత్వాదివ్యత్వములు, జ్ఞానాజ్ఞానములు రెండును నున్నవి. అతడు వసిష్ఠునిచే నుపదేశమునొంది యొకరికి శిష్యభూతు డయినాడేకాని, తానై యుపదేశకపదవి నందలేదు. మరియు సీతాదేవీ వియోగాది ఘట్టములందు రాముడు ప్రాకృత జనునట్లు విలపించి తనలోని యజ్ఞానమును ప్రకటించును. శ్రీకృష్ణుని జీవితములో నట్టి దెచ్చటను లేదు.

భారత రామాయణములలోని భాష వలె భాగవతములోని సంస్కృతభాష అంతసులభమైనదికాదు. విషయముకూడ వేదాంత బంధురమగుటచేత శాస్త్ర జటిలమై యుండును. ఇట్టిదాని ఆంధ్రీకృతి యెంతకష్టమో కదా! కావుననే భాగవత గ్రంథ ప్రాశస్త్యము నెన్న తనవశముకాదని

"భాగవతము దెలిసిపలుకుట చిత్రంబు
శూలికైన తమ్మిచూలికైన
విబుధ జనులవలన విన్నంత కన్నంత
దెలియవచ్చినంత తేటపఱతు"

అని సవినయముగా తాను పెద్దలచే నెఱింగిన మట్టుకు మనవి యొనర్చెద ననినాడు. చదువుసంధ్యలాతనికి భగవత్కృపచే కల్గినవేకాని, ఉద్దండులైన గురువులను శుశ్రూషించి పొందినట్టివి కావు. అయిననేమి-

"పలికెడిది భాగవతమట
పలికించెడి వాడు రామభద్రుం డట, నేఁ
బలికిన భవహర మగు నట
పలికెద వేఱొండుగాథ పలుకగ నేలా!"

దీనినిబట్టి పోతన ఎంతటిభగవత్పరాధీనుడో, ఆత్మవిశ్వాసము కలవాడో వ్యక్తమగు చున్నది.

నన్నయ ధారాశుద్ధి; తిక్కన - రసస్ఫురిత బంధము, ఎఱ్ఱన-సూక్తివైచిత్రి, సోముని-సాహితీవిదగ్ధత, శ్రీనాథుని - క్రొత్త ఎత్తుగడలు - అన్నియు నొక మూసలో కరగినచో పోతన శైలి పాంచభౌతికశరీర మగును.

"కొందఱకు తెనుగు గుణ మగు
కొందఱకును సంస్కృతంబు గుణ మగు
రెండుం
గొందఱకు గుణములగు, నే
నందఱ మెప్పింతు కృతుల నయ్యై
యెడలన్."

అని ఆకాలపు టభిరుచుల ననుసరించి, అతడు నిరాడంబరముగా ప్రతిజ్ఞ చేసినాడు.

మహాభక్తుడగు నితడు, భక్తిరస ఘట్టములను వర్ణించు పట్టున తన్మయుడై పోవును. ఒక్కొక్కసారి మూలమున నున్న అర్థమును విస్తరించును. వివరించును. ఆకారణమున సంస్కృత భాగవతమునందలి యర్థకాఠిన్యము తెలుగు భాగవతమున చూపట్టదు. దాని కిది వ్యాఖ్యాన ప్రాయముగ నుండును.

పోతనగారి భాగవత రచన వైష్ణవమత వ్యాప్తికి కూడ ప్రోత్సాహకరమయ్యె నేమోకాని 'మమ శివకేశవాః సమానాః తథాపిభక్తిస్తరుణేందుశేఖరే'- అన్నట్లుపోతన భక్తి శివకేశవ భేదములేని కేవలాద్వైతమూలము. విష్ణురూపాయ నమశ్శివాయ"అని తనభావమును తిక్కన హరిహరాద్వైతముగా బిలుచుకొన్నాడు.

"బమ్మెర పోతరాజు కవిపట్టపురాజు దలంచి మ్రొక్కెదన్"-

అని కవులందరకు ఇతడనిన అపార గౌరవము కలదు. ఆగౌరవపరిధి ఇంతయని చెప్పుటకు అలవికాదు. భాగవత ప్రతి పాద్యుడైన శ్రీకృష్ణభగవానుని ప్రేమించు వారికన్న పోతరాజుగారిని ప్రేమించువారే లోకములో విస్తారముగా నున్నారు. పోతన కవులలో అగ్రస్థానము వహించుటయేకాక భక్తులలోకూడ అగ్రస్థానమును వహించెను. అయినను నీప పోకవిని నన్నయాదులతోపాటు ప్రయోగ విషయమున కవిలోకము అనాదిగా గౌరవించినట్లు కనబడుటలేదు. తెలుగుభాష పుట్టిన తరువాత నింత రసబంధురముగా కవిత్వము చెప్పగల వ్యక్తులు చాల అరుదుగ పుట్టియుండెగల రని అందులో ఇతడు 'కనిష్ఠికాధిష్ఠితు' డనియు పలువురు విశ్వసింతురు-

పోతన కవిత్వము ప్రతిపద్య రసాస్పదము. శబ్దాలంకారముపై ఈతనికి మక్కువ ఎక్కువ. భాగవతమున కింతటి ప్రజాదరము అందలి భక్తి భావము వలననే కాదు, మంద్రగంభీరగమనముగల యాతని శైలివలనను వచ్చినది. అది సహజధారావిలసితము. శ్లేషలో తెలుగు కవులలో భట్టుమూర్తి ననుకరించుట యెట్టిదో అంత్యానియమములో పోతనను అనుకరించుటయు నట్టిదే.

గజేంద్ర మోక్షమో, గోపికాగీతములో ఏవో నిత్యము తెల్లవారు జామున పారాయణ చేయని ఆంధ్రులు లేనేలేరని తెలియును. క్రమముగా భక్తి నానాటికి తగ్గి కృశించుచున్న ఈరోజులలోకూడ యీపారాయణము పూర్తిగా తగ్గలేదు. ఈ భాగవతమునకు తప్ప ఈ మహాభాగ్యము మఱియింక ఏమహాకవి కవిత్వమునకు లేదు.

కవితా వైచిత్రి కనుపడని వేదాంతఘట్టములను మృగపద ఘటనచే తెనుగున రమ్యముగ చేసినాడు. స్వాభావిక శిల్పజగత్తు నందలి పాత్రలు మనవలెనే భాషించి మన కవగతములంగనుండును. ఈతడు సృష్టించిన పాత్రలలో వైవిధ్య ముండును.

భాగవతకవి కనుప్రాస లనిన ప్రీతి. వీనిని వాడుటయందు వల్లమాలిన మక్కువ కలవాడీతడు. ఉదాహరణమునకు—

"... వీరావేశిం
బలరాశిన్ జగదభినవరాశిన్, విజితశక్ర
పాశిం గేశిన్"

పోతన శబ్దార్థముల రెంటికి సమాన గౌరవము నిచ్చి సామర్థ్యాతిశయముతో శబ్దార్థాలంకారము లుపయోగించెను. తరువాతి ప్రబంధకవులకు వీరి యిట్టి పోకడలే మార్గదర్శకములైనవి.

"ఘను డాభూసురు డేగెనో నడుమ మా
ర్గశ్రాంతుడై చిక్కెనో
విని కృష్ణుండిది తప్పుగాదలఁ చెనో
విచ్చేసెనో యీశ్వరుం
డను కూలింపఁదలంచునో తలపడో
యార్యామహాదేవియున్
ననురక్షింప నెఱుంగునో యెఱుగదో
నాభాగ్య మెట్లున్నదో

రుక్మిణీదేవికి వివాహాత్పూర్వము కలిగిన ఆందోళనను అంత్యానియమాది శబ్దాలంకృతులచే నిపుణముగా (మానసిక స్థితిని) చిత్రించినాడు. పాత్రపొందిన భావమును, అవస్థాచిత్రణమును ప్రత్యక్షముగా చూపినాడు

మోక్షమునకు ముఖ్యసాధనమైనభక్తి ప్రపంచింప బడినది. వాత్సల్య భక్తిలో కొంతగా, శృంగారభక్తిలో నింతగా, విరహార్తి వీథులలోవింతగా పోతనకవిత రమ్యమై విలసిల్లినది.

భాగవతమున వ్రాసినంత శృంగార రసము నెవ్వరును రచింపలేరు. కాని యావద్గ్రంథమును పఠించిన తరువాత పర్యవసించునది భక్తిరసము! దీనినే మధురభక్తి అందురు. దీని కాటపట్టైన

"నల్లనివాడు పద్మనయ
నంబులవాడు కృపారసంబుపైఁ
జల్లెడువాడు మౌళి పరి
సర్పిత పింఛమువాడు నవ్వురా
జిల్లెడు మోమువా డొకడు
చెల్వలమానధనంబు తెచ్చెనో
మల్లియలార! మీపొదల
మాటున లేడు గదమ్మ చెప్పరే."

"అంగజు నైనఁజూడ హృద
యంగముడై కరగించువాడు శ్రీ
రంగ దురంబువాడు మధు
రంబగు వేణురవంబువాడు మ
మ్మంగజు పువ్వుదూపులకు
నగ్గముచేసె లవంగలుంగనా
రంగములార! మీకడకు రాడుగదా!
కృప నన్నుఁ జూడరే"

శ్రీనాథుని భీమేశ్వరపురాణము, హరవిలాసము, కాశీఖండము, శివరాత్రి మాహాత్మ్యము భక్తిసంపన్నములు—పోతన భాగవతములో భక్తితోపాటు శృంగార రసము వెల్లివిరియుచున్నది. వాస్తవమును విచారించిన సుకుమారమైన శృంగార చిత్రణమునందు పోతనతో సమానుడైన కవి మరొక్కరు లేరని తోచుచున్నది. కేవలము రూపకల్పన యందేకాదు. భావ చిత్రణమందును ఇతడద్వితీయుడు. ఆంధ్రశృంగార కవులలో పోతనది అగ్రతాంబూలము. తెలుగు భక్తికవులలో పోతన మున్నెన్నదగినవాడు. పోతన శృంగారము విలక్షణమైనది. మధుర భావోపేతమైనది.

వామనమూర్తి మూడడుగుల నేల ధారపోయునప్పుడు

"ఆదిన్ శ్రీసతి కొప్పుపై తనువుపై
అంసోత్తరీయమ్ముపై
పాదాబ్జంబులపై కపోలతటిపై
పాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీఁ
దై నాకరం బుంట మేల్
గాదే రాజ్యముగీజ్యమున్ సతతమే
కాయంబు నాపాయమే"

అని బలి భావించుటలో పోతన శృంగార హృదయము తొంగి చూచుచున్నది. ఏకొంచెము అవకాశము కల్గినప్పటికిని శృంగార రసపోషణకు పోతనకలము ముందుకు దుముకును. శ్రీనాథుడు ఆంధ్రుల భోజనమును నోరార వర్ణించినాడు.

గజేంద్రుని రక్షణకు పరుగులెత్తుచున్న పరమేశ్వరుడు వైకుంఠపురమునందలి సౌధములోని రమావినోది యట ...

"అల వైకుంఠపురంబులో నగరిలో
నామూల సౌధంబు దా
పల మందార వనాంతరామృతసరః
ప్రాంతేందు కాంతోపలో

త్పలపర్యంకరమా వినోదియగు నా
పన్న ప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహిపాహియను క
య్యాలించి సంరంభియై.

సిరికిం జెప్పడు శంఖచక్రయుగముం
జేదోయి సంధింపఁడే
పరివారంబును జీర డభ్రగపతిం
బన్నింప డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్కనొత్తడు వివా
దప్రోత్థిత, శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడడు గజ
ప్రాణావనోత్సాహియై."

ఇట్టిమనోహర దృశ్యములను చిత్రించినవారు ఆంధ్ర కవులలో ఎంతమంది కలరు?

కుబ్జాకృష్ణుల క్రీడావిశేషము, ఉపాని రుద్ధులపరిణయము, రాసక్రీడలు మొదలైన ఘట్టములు పోతన చిత్రించిన శృంగార వైవిధ్యమునకు చక్కనితార్కాణములు.

"కాటుక కంటినీరు చనుకట్టు పయింబడ నేల యేడ్చెదో హాటక గర్భురాణి,!

తెలుగునోట ఆబాలగోపాల మీకథలను చదవించుకొని విని సంతసించుచుందురు. ఆయాకథలను వర్ణించు నపుడును సంవిధానములను కల్పించు నపుడును, పోతన తెలుగువారి ఆచారవ్యవహారములను, మర్యాదలను పాటించి తీర్చిదిద్దుచు నొక ప్రజాకవియై ప్రకాశించును.

తెలుగువారి పలుకుబళ్ళపోలికల ననుసరించియు, తేటతేటగా ముద్దుముద్దుగా పండితపామరుల మనసు లుప్పొంగున ట్లీతడర్థప్రకటనము చేయకలడు.

"మనయశోద చిన్నమగవాని గనెనట చూచి వత్తమమ్మ సుదతులార!".

ఇరుగు పొరుగు స్త్రీల కుండు వేడుక తేటపరచినాడు. ఇతనికవిత్వము ద్రాక్షాపాక శోభితము.

పోతనకు కవిగా వచ్చినదానికంటె, భక్తుడుగా కల్గిన కీర్తిదొడ్డది. ఆనాటి భాగవతులలో నాతడు నాయకరత్నము. భాగవతములోని ప్రతిభక్తునిలోను పోతనబ్రతుకు తొంగిచూచును. భాగవతము జాతిలో చొచ్చుకొని వెళ్లినను, జాతి తత్త్వమునకు దూరముగా నున్నది.

పోతనయొక్క సందేశము భక్తిప్రధానైకేశ్వరోపాసనా ద్వైతతత్త్వ విశిష్ట మగు నిష్కామకర్మయోగము. భక్తిరసమున ఆంధ్రవాఙ్మయమున ప్రధానపీఠము పోతరాజుదే. ఆతనిని ఆపీఠము నుండి తొలగింపగల కవి'న భూతో న భవిష్యతి' అని సాహసముతో చెప్పవచ్చును.

# గ్రీష్మాటోపము

శ్రీమతి జి. కమలారాఘవన్.



దినములంతంతకు దీర్ఘంబులై దోచె
దిననాథుశౌర్యంబు దీప్తి మెరయ
వెచ్చనిగాడ్పుల వెరపొంది మనములు
మందమారుతముల విందుకోరె
చిరుచెమటలు గ్రాల చిత్తములెరియంగ
కరముల వీవనల్ కాంక్షగదలె
వలిపెలుదాల్పంగ తలపులు వాంఛించె
శీతలోదకముకై జిహ్వలూరె

పనస మామిడిపండ్లిల వాసిమీరె
తేటమజ్జిగ కడదీర్చె పూటపూట
పానశాలలు నిండెను పథములందు
వివిధవిధములు వేసవి వెతనుదీర్చె.

మల్లెలు విరిసినవెల్లెడ
చల్లనిగంధంబు మేని శ్రమమును దీర్చెన్
అల్లరి జాబిల్లినిశల
నుల్లములకు హాయిగొల్పెనో ప్పుగ జగతిన్.

దీప్తిన్ జెలగు వనూరుడు
సప్తాశ్వరథంబుద్రోల సాగె ప్రమోదా
వాప్తిన్ రూక్ష్మకరోచుల
తప్తంబొనరింపదొడగె తరణియు ధాత్రిన్.

దూరతీరము లేగి నీరంబు గానక
దప్పితో ఖగతతి తలలువాల్చె
తడియారు నాలుకల్ తడబడ మృగతతి
ఎండమావులజూచి గుండెలార్చె
రెండుజాముల వేళ చండభానుడు ప్రేల్వ
బాటసారియు చెట్లప్రక్కఁ జేర
వల్మీకములనుండి పరితాపమునఁ జేసి
కాకోదరంబులు కదలకుండె

వనములెల్లను వసివాడె వనరు తరిగి
పూరి గానక పశుతతి మోరలెత్తె
క్షుత్పిపాసల జగమెల్ల క్షోభఁ జెందె
గ్రీష్మ ఋతుధర్మ మీలీల నూష్మమెగయ.

కొండలు రగిలెడి యెండలు
మండెడికార్చిచ్చు లడవిమ్రాకుల ప్రేల్పన్
తండములై ఖగ మృగవే
దండ సమితి దిశల బారె తద్దయు భీతిన్.

వచ్చెమృగశిరకార్తెయు వాసి ననుమ
ఏరువాక పున్నమిరోజు సౌరుమీర
హాలములను బూన్చి రైతులు హారతెత్తి
పసుపుకుంకుమ లలదిరి బాగుమీఱ.

హాలముల బట్టివిత్తనము
లయ్యెడ నెత్తిక నెత్తిచిత్తముల్
మొలకలుదేర నుత్సుకత
ముందుగ సాగిర యేరువాకయున్
ఫలమలికర్షకావళియు
పాటవమేర్పడ పిన్నపెద్దలున్
బలముల జెట్టిపాయకయు
పంటపొలంతికి ప్రాణమిచ్చియున్.

# "కవికొండలవారి" ప్రకృతి గీతములు - ఒక పరిశీలన

- శ్రీ డా. జి. బి. ఎస్. ఆచార్య, ఎం.ఏ.,పి హెచ్.డి.

( గత సంచిక తరువాయి )

"భూమి ఆకాశము" అను శీర్షికతో వ్రాసిన గీతములో భూమ్యాకాశముల స్వరూప స్వభావములను సహజ సుందరముగా చిత్రించి, భూమిపై గల మక్కువను వెల్లడించినారు.

"భూమికే దిగుదాము - మినుకులాగు వానచినుకులాగు" అని నిశ్చయించుటలో భూమికి గల ఆకాశముయొక్క ఆవశ్యకతను ధ్వనింప చేసినారు.

"వెన్నెలలు అను గీతములో వెన్నెల యొక్క అందచందములను చక్కగా వర్ణించి, అందలి సౌభాగ్య మెట్టిదో తెలియజేసినారు. కౌముదీ కమనీయతను కనులపండువుగా ప్రత్యక్ష మొనరించినారు.

"ఉదయము' అనుగీతములో చక్కని దృశ్య సాక్షాత్కారము గలదు. స్వభావోక్తితో అరుణోదయము గుండె తెరపై ప్రకాశింప చేయబడినది.

"మంకెనపువ్వునట్లు మతిబొద్దువాడిచె అను ఉపమాలంకార ప్రయోగములోని ఔచిత్యము ఎన్నదగినది.

"చిన్నకిట్టమ్మ" అనుగీతములో___

"చెఱుకుతోటలో చిన్నది ఉంది
ఆకుచిగురులా బల్ కలుకైంది,
కొండలనడుమ ఇఱుకులోయలో
గండుకోయిలల పిండుకూసినది."

అని రాగవంతముగను, భావమంజులముగను వర్ణించినారు. చెఱుకుతోటలోని చిన్నది ఆకుచిగురులా కలుకైన దనిచెప్పుటలో కవిగారి భావనాశక్తి పరాకాష్ఠనందుకొనినది. ఇంకను కొండలనడుమ ఇరుకు లోయలో కూసిన గండుకోయిలల కూతలను తాము వినుటయేగాక, మనకు గూడ వినిపింపగలుగుట వారిధీశక్తి తార్కాణము.

"పిలిచితిపిల్లా" అనుగీతములో__

"ఆకాశంలో నీలం తెలియదు
అంబుధిలోని నీలం తెలియదు
నీకొప్పులోని నీలంవొకటే
తెలుసునుపిల్లా! తలచితిపిల్లా!
వేకువసంధ్యా ఎఱ్ఱన తెలియదు
సాయంసంధ్యా ఎఱ్ఱన తెలియదు
నీమోవినున్నా ఎఱుపూ వొక్కటే
తెలుసునుపిల్లా! పలచితి పిల్లా!"

అని ప్రకృతిప్రణయములను కలబోసి చమత్కారముగా వర్ణించినారు. ప్రకృతిలో ఉన్న గుణములే ప్రేయసిలో ఉన్నవి. అయినను కవిగారు ప్రేయసిలో ఉన్న గుణములు తప్ప ప్రకృతిలో ఉన్న గుణములు తమకు తెలియవని వింతధోరణిలో ప్రణయ పారవశ్యమును తెలిపినారు. పైగీతములో రెండు భాగములు గలవు. ఒక భాగములో ఒకరంగును, ఇంకొక భాగములో ఇంకొకరంగును ప్రేయసిపరముగా వర్ణించుట జరిగినది. 'నీలం' రంగుకు ప్రకృతిలోని రెండు వస్తువులను 'ఎఱుపు' రంగుకు ప్రకృతిలోని రెండువస్తువులను గ్రహించుటయేగాక_ గీతమంతయు ఒకక్రమ పద్ధతిలో నడచుట గమనార్హము. దీనివలనగీతమునకు ఒక 'తూగు' ఏర్పడి 'శ్రుతిసుభగత్వ' గుణసంభరితమై యున్నది. "భగవంతుని" అను ఖండికలో___

"పూవులలోని తేనెబిందువు
అడవులలోని లేడిచిందులు
దేవుని స్వేచ్ఛే! దేవుని స్వేచ్ఛే!"

అని స్వేచ్ఛగా గాన మొనరించినారు. ప్రకృతిసిద్ధమైన స్వేచ్ఛనుకోరినారు. పరమేశ్వరునిమహిమను వెల్లడిచేయు ప్రకృతిని అండగా చేసికొని, చక్కని కవిత్వమును సృష్టించి, ప్రశంసింపబడినారు.

"శివరాత్రిప్రభ" అనుగీతములో ___

"కాలకంఠుని నాగసర్పము - కుబుసమూడ్చి పడగబుస్సంది,

రెండునాల్కలు.........

గండుమీసా లట్లు దూసింది; - చెవులు మోసింది; నాగసరమూదేదియెవరోయి?- రాగ మొలికించేది యెవరోయి ? కాఱునల్లని కాళరాత్రి!

అని ప్రకృతిలోనిరహస్యములను తెలిసికొనగోరిన కవికొండలవారు భావములోను, భావములోను, ఊహలోను, కల్పనలోను సర్వస్వతంత్రులు. ప్రకృతిలోగల ప్రతివస్తువు వారికవితకు విషయముకాగలిగినది. వారికి ప్రాచీన సంప్రదాయములతో గాని, ప్రాచీన ఛందస్సుతో గాని పనిలేదు. భావమునకనువైనభాష, భాష కనువైన ఛందస్సు వారిచేగ్రహింపబడినవి. వారి గీతము నడకలో ఒక విధమగు ఉత్సాహము, ఆవేశము పరుగులెత్తు చుండును.

"పూచింది మల్లియ!
కాసింది మామిడి!
వీచింది తెమ్మెర!
ఊచింది లతకూన!
ఏచాయసుగ మో యిదీ ?
చూచాయగా తోంగి
చూచేనురా సఖుడ !
క్రొంగ్రొత్త యేడాది_
కళలమూతన్ నీకు!
కోర్కె లీడేరతన్ !"

అని శుభాశంసన మొసంగి సుకవిగా కీర్తింపబడినారు.

"మేఘశకలంబేని అడ్డని
లాఘవపు సూర్యాస్తమానము

ఎఱ్ఱబింబము – కఱ్ఱచీకటి
అంతే! – సాధ్యవిశీర్ణశోభల
మధ్యవర్తిత్వంబు లేదటు –
చల్లనగు తెమ్మెరలు గౌతమి
యుల్లమున మేల్కొల్పె కరడులు
దరిని గల సాంద్రంపు(గనుపపు
లరయు, దీర్ఘశిరోజముల, నొగ
యింతియఖ్యంగనంబై, వె
న్నారబోసికొన గోళ్ల దువ్వుచు
లీల మెడగప్పికొని యూచెడు
అందమున గను పట్టదొడగెను –
తొందఱగ మానావ పోత్రూ
డెందమున కానంద మిచ్చెను."

అని మధురానుభూతిని వ్యక్తముచేసినారు. ప్రకృతి రామణీయకమును రసాత్మకముగా వర్ణించి రసజ్ఞుల నానంద డోలికల నూగింపగలశక్తి కవిగారికి కలదనుటకు పైగీతమే నిదర్శనము.

"కవితకి రెండుకళ్లు ఆలోచన – అనుభూతి. అవి లేందేకాగితాలు నింపటం తప్ప మరేమీ జరగదు. చదవాలి – జీవితాన్ని, ఆలోచించాలి– అనుభూతిని ప్రతిభాస్పందంతో– అప్పు డవుతుంది. కవిత – ఒక సౌందర్యస్యందనం – అనుభూతి సౌధం – జీవనదర్శనం,"[1] అని డా॥ అరిపిరాల విశ్వంగా రన్నట్లు కవికొండలవారికవితకు ఆలోచన–అనుభూతి అను రెండుకళ్లూ కలవు. కనుకనే వారి కవిత సౌందర్య స్యందనము – అనుభూతి సౌధము–జీవనదర్శనము.

"దాక్కొని ఉంటాయ్! దారంటగడ్డి ని
రుక్కొని ఫుంటాయి!
తలపగరానిపూలు, పిలువగబోనిపూలు,
నిలుపగలేనిపూలు– దాక్కొనివుంటాయ్,
గ్రుక్కెడువాననీళ్లకు పక్కున నవ్వుతాయి
లెక్కకురావోలక్షే,చిక్కవుమాలనుగ్రుచ్చ
ఇక్కడనక్కడ బచ్చ,జక్కనపూస్తాయి."

అని అతిసాధారణవర్ణనముతో తమ కవితోద్యానములో రమ్యభావ ప్రసూనములను పూయించుటయేగాక–

"మంచు బిందువు పడిన,
ఎంచి బాష్పము విడిన
అంచుల గాస్తాయి, వంచక నోస్తాయి."

అని మహోదాత్తముగా సంభావించి, తమ భావనా బలమును వెల్లడించినారు. ఇందు గడ్డిపూతను సామాన్యమానవులకు ప్రతీకగా చేసి వర్ణించినట్లు తోచుచున్నది. గడ్డిపూలు మంచుబిందువును, బాష్పమును సమానముగా భరించిన ట్లే – సామాన్యమానవులుకూడ సుఖమును, దుఃఖమును సమానముగా భరింపగలరని ధ్వనింప చేసినారు.

పైవిధముగా పరిశీలించుచు పోయినచో ఎన్నిగీతముల నైనను ఉటంకింపవచ్చును. స్థలాభావముచే కొన్నింటిని మాత్రమే కవితాప్రియులకు పరిచయము చేయుట జరిగినది. "నవ్యకవిత్వము – ప్రకృతివర్ణన" అనినంతనే ప్రేళ్లమీద లెక్కింప దగినవారిలో కవికొండల వారిని మొట్టమొదటగా పేర్కొనవలసియున్నది. కనుకనే కవికొండల వారి కమనీయ కవితోద్యానములో పుష్పించి, వికసించిన శతాధిక సుందర సుకుమారగీతికా సౌగంధసుమరాజములు నవ్యకవితామతల్లికి వెలలేని భూషలై విజ్ఞులచే విశేషముగా నాదరింపబడుచున్నవి.

---

1 'యువభారతి' వారి 'సిందూరం' (వచనకవితల సంకలనం) లోని "కవిత పేరు ముందుచూపు" అను పీఠిక: డా॥ అరిపిరాల విశ్వం. పుట. 7

## కన్నీళ్లు

– కుమారి పి. పద్మజవాణి.

నారూపం నీకనుల నిండేవేళ
అలా కళ్ళుమూసుకోకు
కరిగేకన్నీటి జాలుని
కన్పించకుండా చేయకు
కన్నీటికి అర్థం తెలుసానీకు ??
కరుణతో కూడినకనుల
నీటి బిందువు లవి.
ఎడద భారాన్ని దించే
దయాసింధువు లవి.
మండేమనసును చల్లార్చే
మల్లెలజల్లు లవి.
పశ్చాత్తాపం నిండినవేళ
మనిషికి మిగిలిన
ప్రత్యూష పారిజాతాలవి.
చల్లగా ఆర్ద్రంగా రాలే
కన్నీటి బిందువులు
కరగిన మనసు
కళ్ళల్లో పరచుకునే నీడలు
పరవశ మందిన వేళ కమనీయంగా
హృదయాన్ని ప్రతిబింబించే
రమణీయంగా రంగుల మెరిసే
హరివిల్లులు అవి.
అలాంటి కన్నీటిని దాచే
ప్రయత్నం చేయకుండ
అవిరామంగా కురిసే
ఆపన్నీటితో
బ్రతుకే పవిత్రం కానీ !!
ఆవేదనలు రగిలేవేళ
అజరామరత్వమే నిండనీ !!!

# తిలక్ కవితలు - సంప్రదాయపు ఛాయలు

- శ్రీ మట్టి వెంకట నరసింహారెడ్డి

[శ్రీధరరాయకవి (M.B B.S, D.T.M. చీరాల) ... పురస్కారము - 1989]

యుగధర్మముల ననుసరించి రాను రాను భౌతిక నైతిక - విలువలు సన్నగిల్లుతాయి. ఎందువల్ల అని ప్రశ్నిస్తే- ప్రకృతి విస్తరిస్తున్నకొలదీ మానవుని మేధ ఏకాగ్రతనుండి వ్యాప్తి పొందుతుంది. ఆదిలో వేదములు గురుపరంపరయా శిష్యసంతతికి సంక్రమించుతూ వచ్చినవి. అందువలననే వానికి శ్రుతులు అని పేరు. వినబడినవి అని అర్థము. కాని కొంతకాలము తరుదాత ఏకాగ్రత నశించి పోగలదని అనుకొన్నపుడు మహాత్ములు వానిని గ్రంథస్థము చేసి ఉంచినారు. "ఏవిషయమునందేని విజ్ఞానము సార్వజనీనము కానపుడే తద్విషయక గ్రంథము ఉదయించును. శబ్దార్థజ్ఞానము కొఱవడినపుడు నిఘంటువు, కర్మాచరణజ్ఞానము కలతవడినపుడు కల్పము, అట్లే వర్ణాశ్రమాచారములు గ్రంథములను పుట్టినట్లు మనకు తెలియకపోదు." అన్న మల్లాది వాక్యములు ఈసత్యమునే చక్కగా వివరించినవి.

ఆవిధముగానే వాఙ్మయము నందును ఆరంభదశనుండి పరిణామమునొంది పరాకాష్ఠనొందినను క్రమముగా క్షీణదశకు చేరుకొనును. ప్రపంచములోని ఏభాషా వాఙ్మయమునందైనను మనము ఇట్టిస్థితిని గమనింపవచ్చును. అసలు ఒక్కమాటలో చెప్పవలెనన్న సృష్టిరహస్యమే అది. మానవజీవితములోని దశలను పరిశీలింప ఈ విషయము విశదమగును. ఆరంభదశలైన శైశవకౌమారములనుండి యౌవనమును చేరి పరాకాష్ఠనొందును. వార్ధక్యము ప్రవేశించి క్షీణతను అపేక్షించును. మచ్చునకిది. సృష్టిపరమార్థమే అది. ఆవిధముగా సాహిత్యమునందును - భాషాసంస్కారార్థ నియమములైన వ్యాకరణము, సాహితీరసపోషణావశ్యకమైన విషయములను నిబద్ధమొనర్చిన ఆలంకారిక గ్రంథ విషయములోకాని, గ్రామ్యాక్లిష్టతకాని, భావకాఠిన్యముగాని ఏవిషయమందైనను సరే క్రమముగా ఆయాగుణములకు క్షీణత ఏర్పడును. అపుడు సుకుమారబుద్ధులైన మనకు సులభగ్రాహ్యములుగా తయారగును. సాహిత్యము ఆయాకాలములందలి ప్రజాభిరుచులనుబట్టి మారుతూవచ్చినది. అది మార్పో క్షీణతయో విజ్ఞులు నిర్ణయించవలె. ఒకనాటి అభిరుచి ఒకనాటికి ఉండదు. ఆనాటి అభిరుచి నేడు లేదు. కావ్యములయందు సామాన్యుడు నాయకుడు గాకూడదని పూర్వులమాట. నేడు కావ్యనాయకుడుగా సామాన్యుడే వర్ణింపబడవలెనని, వారిని గురించి వ్రాయని కావ్యము కావ్యము కాదనియు తీర్పునిచ్చిరి. ఏ యుగపు అభిరుచి ఆయుగమునది. కాదనుటకు వీలులేదు. విలువలు తగ్గిపోయినవి అనుట కూడని మాట. దీనిని లోకాతిశాయి యయిన లోకానుసారియైన మార్పు అనవలె. అట్లే అందము. దేశమునుబట్టి కాలమును గాంచి ప్రభుత్వము నెంచి గదా మసలవలెను అది సత్యమా - అసత్యమా అనునది వేరుమాట.

ఈవిధమైన మార్పులకులోనై యిపుడు చేరుకున్న దశ వచనకవితా ప్రక్రియ. సాహిత్యము ఇన్ని సడలింపులకు లోనై బిగిని కోల్పోయిన కాలమునకూడ సార్వజనీనమై నిత్యనూతనమైన ప్రాచీనార్వాచీన - విలువలను గౌరవించి వచనకవితా వాఙ్మయమును కూడ తన అనల్ప మేధా సామర్థ్యమున అందరాని అంబరాలకు చేర్చి సంప్రదాయ వాదుల అభ్యుదయవాదుల మెప్పులను పొందిన తిలక్ అద్భుతసృష్టియే "అమృతం కురిసిన రాత్రి". కేవలము ఈ యుగపు ఒరవడిని బడికొట్టుకుపోక మంచినంతను ప్రోవుచేసి మనకందించిన వాడు తిలక్. ఇట్లు చేయుట అనునది కవిత్వమునెడ ఒక ప్రత్యేకదృష్టి. కొన్ని నిశ్చితమైన [illegible]ప్రాయములులేని సామాన్యులకు చేత కానిపని. కేవలము ప్రాచీన సాహిత్య [illegible]రసనములే ఆధునిక సాహిత్యము అన్న విధముగా పరిగణించిన ఆధునికతను తిలక్ స్వీకరించినవాడు కాడు. అట్లైనచో తిలక్ కవితలలో విశిష్టతయే లేదనవలసి వచ్చును. వ్యాకరణమును ఛందస్సును కొంత సేపు మూలను ఉంచి తిలక్ కవితలను చదివినచో మనకు ప్రాచీన సాహిత్యపు సంస్కృతీ ఛాయలు దర్శనమిచ్చును. ప్రాచీన వాక్యములందు మహాకవులు అనేక శాస్త్రవిషయములను నిక్షిప్తపరచిన వారైనను కావ్యము కాంతా సమ్మితముగాన మనకు ఎచ్చటను శాస్త్ర దృష్టులు కలుగనీయక రసాస్వాదన మొనరించుటకు వీలుగా రచించిరి. ఇంకను ప్రాచీన కవులు అవతారికలయందు తమ కావ్యలక్షణములు కుకవి నింద, పూర్వసుకవులస్తుతి, ప్రయోజనములను చెప్పుకొనిన విధముననే తిలక్ కూడ తన కవితలలోనే ఈవిషయము లన్నింటిని చెప్పుకొనెను. ఆవిషయ నిరూపణమే ప్రస్తుత వ్యాసవిషయము.

తిలక్ కవితాలక్షణములు ప్రాచీన కవుల మార్గముననే చెప్పికొనినాడు. 'నా కవిత' అను ఈ గేయం పరిశీలించుడు.

"గాజు కెరటాల వెన్నెల సముద్రాలూ
జాజిపువ్వుల అత్తరుదీపాలూ
మంత్రలోకపు మణిస్తంభాలూ
నాకవితా చందనశాలా
సుందర విచిత్రాలు"

పైని చెప్పిన తిలక్ కవితాశైలికీ రఘునాథుని శైలీ రమ్యతను గురించి చెప్పిన పద్యమునకు పోలిక -

చెప్పవలెన్ కపురంబులు
కుప్పలుగా బోసినట్లు కుంకుమ పైపై
గుప్పినక్రియ విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనన్ కవిత్వము సభలన్.

ఇరువురూ శైలీరమ్యతను – ఆహ్లాద జనకముగా నుండవలెననియే నిర్వచించిరి. అనగా తిలక్ తనకావ్యవస్తువు అందముగా నుండవలెనన్న అందముగా చెప్పవలెననని యెంచినవాడు. శైలి అహ్లాదముగా నుండి చదివింపవలెను. లేని యెడ వస్తు వెవనికి తెలియును?

తనకావ్యవస్తువును కూడ ఇదే గేయములో చెప్పుకొనెను.

అగాధ బాధాపాథః పతంగాలూ
ధర్మవీరుల కృతరక్త నాళాలూ
త్యాగశక్తి ప్రేమరక్తి శాంతిసూక్తి
నాకశాకరవాల ధగద్ధగరవాలు

విస్తృతముగానే వివరించినాడు. తన విశాలహృదయమును పరచి చదువుకొమ్మనినాడు.

ఈకవితను ఇట్లా వ్రాసి చివరికి సపర్యోప సంహారమును గీతములోవలె చివరగా –

"నాఅక్షరాలు కన్నీటిజడులలో
తడిసే దయా పారావతాలు
నాఅక్షరాలు ప్రజాశక్తుల వహించే
విజయ ఐరావతాలు
నాఅక్షరాలు వెన్నెలలో ఆడుకునే
అందమైన ఆడపిల్లలు."

మొత్తముమీద తిలక్ కావ్యవస్తువెట్టిదనిన– బాధితపీడిత ప్రజాజీవితములు, మహామహులత్యాగశక్తులు, శాంతి సూక్తులు. పిండితార్థమేమన సామాజిక ప్రయోజన, ప్రబోధకారియైన వస్తువు; హృదయాహ్లాదజనకమై పాఠకుని చదివించు సామర్థ్యముగల శైలీసౌభాగ్యము; ఆయన కవితాకన్య అద్భుతమూర్తి.

ఈయన ఆడపిల్ల మరీ అందమైనది. వెన్నెలలో ఆడుకొనుచున్నది. పాపం దీనంగా దేశాంతరగతుడైన ప్రియుడి రాకకు ఎదురుచూస్తూ నిరాశతో పొడియుసుకతో ఇళ్ళుకడుతూ ఉండవలె; మంచికాలమున కెదురుచూచే మానవతామూర్తివలె; అన్నమాట ఈయన కావ్యకన్య. ఆపిల్లను పదేపదే చూడాలనిపిస్తుంది. వచనకవితాయుగమునందలి చాలమంది కవుల కన్యలు వెన్నెలలో ఆడకపోతేమానె అందముగానైనను కనబడరు సరికదా జన్మలో చూడక కూడదని నిర్ధారణచేసుకొని వైరాగ్యమార్గము నవలంబింపజేయ సమర్థులుగా నున్నారు. ముఖము చూడగనే డ్రెనేజీలకంపు, పిచ్చిపట్టిన దానివలె కర్ణకఠోరగమైన వికారపుకూతలు ... ఎన్నని! కాని తిలక్ కావ్యకన్య అట్టిదికాదు. "వర్తమానా వర్తఝంఝూవీచికలకు కాళ్ళు తేలిపోయే" నీరసులు సైతము కాళ్ళూని నిలిచి కళ్ళునుఱంత విచ్చి చూచి సమ్మోహితు లగుదురు. దానిసంస్కారమునకు ముచ్చటపడి వల్లెయందురు. సంస్కారయుతమైన సౌందర్యము మరింత ఆకర్షణీయముగ నుండునుగదా!

తిలక్ తన కవితలయందు శాస్త్రవిషయములను కూడ చెప్పినాడు. "అభినవ ఋగ్వాదము" అనుకవితలో భౌతిక శాస్త్ర విషయమును హృదయంగమముగా కూర్చినాడు –

"ఇదివరకూ నీవైపు న్యూటన్ థియరీ ప్రకారం ఆకర్షింపబడ్డాను అయిన్‌స్టీన్ వచ్చాక థియరీ ఆఫ్ కర్వేచర్ ఆధారంగా నిన్ను ప్రేమించాను. ఇపుడెలాగు చెప్పు.
హాయిల్ నర్లేకర్లు వచ్చిఅంతా ఉల్టా సీదా చేశారు."

భౌతికశాస్త్రంలో కూడా ప్రేమ కురిపించినాడు. తిలక్ భావస్వాతంత్ర్యమునకిది చక్కని ఉదాహరణ. ఇట్లే "వసుధైకగీతం" అను మఱొక కవితలో ఖగోళిక విజ్ఞానము పొందుపరిచినాడు.

స్పష్టతకొఱకు శాస్త్రవిషయ నిక్షిప్తమైన శ్రీనాథుని పద్యము– ప్రాతఃకాలము పాయ కాకి పణినాపత్యోక్త శాస్త్రంబులో కాకాయనన్ తాతశ్స్థానులు చెప్పు డెవ్వియను చందొప్పు ... "ఈపద్యమున పాణినీయము చదువుకొని మరీ మాటలాడుచున్నవి కాకకోకిలలు. వ్యాకరణశాస్త్ర విషయమిందులగదు.

తిలక్ కవిత్వ మనగా నెట్లుండవలెనో వివరించుచున్నాడు.

"కవిత్వం ఒక ఆల్కెమీ
అదికాళిదాసుకు తెలుసు పెద్దన్నకు తెలుసు
కృష్ణశాస్త్రికి తెలుసు శ్రీశ్రీకి తెలుసు"

అని శిల్పము నెడ ఆయనకు గల అనురక్తిని మరింత ప్రస్ఫుటముగావించినాడు. ఈరచనాశిల్పము తిలక్ దృష్టిలో ఏఏ ప్రాచీనార్వాచీన కవులు సమర్థముగా పోషించినారో చెప్పి ఆర్ష కవుల యెడగల గౌరవము, అర్వాచీనకవులయెడగల అభిమానమును ప్రకటించినాడు.

తిలక్ ప్రకారము – కవిత్వమనునది ఒక ఆల్కెమీ (Alchemy)

"Alchemy= chemistry of the middle ages; the chief aim of which was to discover how to change ordinary metals into gold."అని ఆంగ్ల నిఘంటువొసగిన యర్థము.

ఆంధ్రమున "పుటము పెట్టుట" అని అర్థము చెప్పుకొనుట సముచితముగానున్నది. క్షుద్ర లోహములను బంగారముగా తయారుచేయుట అనికూడ అర్థము. అట్లు తయారుచేయుటకు పుటముకట్టవలెను – అనగా రసాయనీకరణ మొనరించవలెను. ఆ లోహాదులు బంగారముగా మారినా మారకపోయినా వాద భ్రష్టులైవైద్య శ్రేష్ఠులయినను కాకపోరు. దీనిని కవిత్వమునకట్లు అన్వయింపవచ్చును. పదముల నే సాధారణ లోహములను శైలిఅనెడి బంగారంగా మార్చుట. శయ్యా సౌభాగ్యమువలెనే శైలి సిద్ధించును. తిలక్ 'శయ్య' అను అలంకారపదమునకు ప్రతిగా 'Alchemy' అను నీపదమును వాడినాడనుట నిస్సంశయము.

సంస్కృతాంధ్రాంగ్ల లాక్షణికులు కవులు శయ్యనుగూర్చి నిర్వచించిరి "పద ములయొక్క ఒద్దిక లేకపొత్తు - అనగా ఏ పదము వెంట ఏపదము కూర్చిన సొబగో అదిశయ్య" శయ్యాశబ్దసంబంధమైనది. ఇది మన ప్రాచీనకవులయెడ పద్యశిల్పమన జెల్లి నది. ఆధునికులైన తిలక్ వంటివారల విష యమున నేర్పుతో కూడినరచన అనిచెప్ప వచ్చును. ఈరచనావిషయమైన నేర్పు తిలక్ కవితలయందు సుస్పష్టము. కావుననే తిలక్ తన శైలివిషయమును మిక్కిలిగా నొక్కి చెప్పినాడు.

తిలక్ కావ్యప్రయోజనములను కూడా విదితము చేసినాడు.

'నవత-కవిత' అను గేయములో—

"అగ్ని జల్లినా అమృతం కురిసినా
అందం ఆనందం దాని పరమార్థం"

అని ఆనందము నెడ మొగ్గుచూపించి నాడు. తిక్కనగారును "ఆంధ్రావళి మోదం బొరయునట్లుగా" వ్రాయుదు ననియేగదా చెప్పుకొన్నది.

పైవాక్యాలలోనే "అందం" అన్న పదంవేసి శైలీ ప్రాముఖ్యమును మరింత నొక్కి చెప్పినవాడయినాడు.

కావ్యప్రయోజనముగా తిలక్ ఆనంద మునకే ప్రాధాన్యము నిచ్చినవాడయ్యు ఉపదేశముగూడ నుండవలెనని అభి ప్రాయపడినాడు. ఈ పాదములు పరిశీ లించుడు-

"అన్నా! కవిత్వం అంతరాంతరజ్యోతి స్సీమల్ని బహిర్గతంచేయాలి విసరించాలి చైతన్యపరథ" - ఉపదేశము ఉండవలె ననియేకదా భావము.

కావ్యప్రయోజనములను ప్రాచీనులు కూడ ఆనందోప దేశములుగనే చెప్పిరి.

కావ్యప్రకాశకర్తయైన మమ్మటుడు -

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే
శివేతర క్షతయే
సద్యఃపరనిర్వృతయే కాంతాసమ్మిత
తయోపదేశయుజే" అనిచెప్పెను.

కావ్యమువలన ,యశస్సు, అర్థమును, వ్యవహార పరిజ్ఞానమును, అమంగళ పరి హారమును, సద్యఃపరనిర్వృతియు, ఉప దేశమునుకలుగునని పై శ్లోకము భావము.

సద్యః పరనిర్వృతి- ఆనందము, ఉప దేశము, ఈరెండు తిలక్ చెప్పెను. యశస్సు సత్కావ్య నిషేవణమువలన కలుగును. తిలక్ది సత్కావ్యమే. అర్థ మును వ్యవహార పరిజ్ఞానము - ఇందుకు కావ్యని స్తుతికావలె. కవితాశకలములలో అదెట్లు సాధ్యము? పిదప అమంగళపరి హారము - "కాళరాత్రి కంకాళాలు చెప్పిన రహస్యం" వినిపించే ఈకృతుల వల్ల అమంగళపరిహారమునకు తావులేదు. ఏయుగపు అభిరుచి ఆయుగములోనిది. "కాలి కమురు కంపుకొడుతున్న కాలం కథలు మానవవ్యథలు" కావాలిపుడు. కనుక దానిని తరచవలసిన పనిలేదు.

తిలక్ కుకవినిందకూడా చేసినాడు. సుతిమెత్తగా మందలించినాడు -

"ప్రతిమాటకీ శక్తి ఉంది, పదును ఉంది
ప్రతిచిత్రణకీ అర్థం ఉంది, ఔచిత్యం
ఉంది
గులకరాళ్ళ డబ్బా మోగించి
గొప్పసంగీతం అని దబాయించకు
అలిగినన్ను శపించకు అన్నా!
నీమీద నాకు కోపంలేదు."

ఈయుగములోవలెనే కవులు కాగి తానికి ఒకడుండేవాడో ఏమో శ్రీనాథుడుకూడా యీవిధముగానే- 'గాడిదా నీవున్ కవివి కాదుగదా అను మానమయ్యెడిన్'' అనినాడు. బల్లగుద్దనిదే బడాకవి కావటము లేదుకదా!

ఆధునిక సాహిత్యరంగములో "అబ్స్ క్యూరిటీ" అను మాటఒకటి వినబడుతూ ఉన్నది. తిలక్ ఆరకము కవిత్వమును గురించి -

"కవిత్వంలో అబ్స్క్యూరిటీ కొన్ని
సందర్భాల్లో ఉండొచ్చు
కాని పాఠకుడికి నీ అనుభూతి ఆకారం
అందాలి హత్తుకోవాలి
అదిట్రాన్స్పరెంట్ చీకటైఉండాలి
నిన్ను పలకరించాలి"

అని తన అభిప్రాయమును చెప్పెను.అబ్స్ క్యూరిటీ (Obscurity) చీకటిగా నుండుట,గోప్యముగానుండుట'అనిఅర్థము 'అది ట్రాన్స్పరెంట్ చీకటైఉండాలి'- సూర్యోదయమునకు ముందు చీకటివలె కనిపించీ కనిపించని విధానమున నుండ వలెనని భావము. ఆవిధమున నుండిననే గదా పాఠకునికి కవి అనుభూతి రూపం అందునది, హత్తుకొనునది. కనుక 'అబ్స్ క్యూరిటీ' అన నట్లుండవలెను. అంతియ కాని 'అబ్స్క్యూరిటీ' అనగనే గాఢాంధ కారమున గంతలు కట్టుకొనినట్లుగా ఉండకూడదు. అబ్స్క్యూరిటీని అంధ కారం చేసినవారూఉన్నారు. పేరుజ్ఞాప కమున లేదుకాని ఎవరో ఒక ఆంగ్లకవి వరేణ్యులు - తానువ్రాసిన గ్రంథార్థము క్రొత్తలో తనకు, దేవునికి మాత్రమే తెలుసుననెనట. కొంతకాలము గడచిన పిదప Only the God knows' అనెనట అబ్స్క్యూరిటీయా? అంధకారమా? అంతేగదా! కృష్ణ శాస్త్రిగారు సైతము తన భావకవితా గీతములను - "అర్థమ్ముకాని భావగీతమ్ము లివి" అని అనే ఫక్కిలో సెలవిచ్చిరి.

Bad luck to the reader; Poor fellow'

ఈ విధముగా అబ్స్క్యూరిటీ కవి త్వము వ్రాయుట క్రొత్తగా గమ్మ త్తుగా ఉంటుందని తిలక్ ఉదాహరణ ప్రాయముగా వాక్రుచ్చిరి -

"రాత్రి రెండోజాములో రెండు కత్తుల్ని
తిన్నాను
గుండెమీద గుండుమీద సల్ఫ్యూరిక్
యాసిడ్ పోసుకున్నాను
నా పెదవుల్ని కత్తిరించి నీవీపుమీద
అతికాను

ఈ నిముసంలో విషంలో నా నేత్రాలు
సువర్ణఝషాలు"
"ఇది పసితనం ప్లస్ వెర్రితనం యింటూ
డికడెన్స్

ఈ కషాయం వికటిస్తుంది. ఈ వ్యవసాయం వెర్రితలలు వేస్తుంది" అని తీర్పునుకూడాయిచ్చినాడు. కాబట్టి అబ్సక్యూరిటీ అన్నది మన గుండెల మీద సల్ఫ్యూరిక్ యాసిడ్ పోసుకున్నట్లుగా ఉండకూడదు మరి.

ఈ "అబ్సక్యూరిటీ" తిలక్ దృష్టిలో ప్రాచీనకావ్య సంప్రదాయమైన 'ధ్వని' సిద్ధాంతమునకు మారుగా వాడినమాటయని స్ఫురించక పోదు. తిలక్ ఎంత మోడరన్‌గా చెప్పినా సంప్రదాయపు చాయల నుండి తొలగినవాడుకాడు. ధ్వనియన- ఒకటి వాచ్యార్థముగానుండ రెండవది వ్యంగ్యముగా ధ్వనియింటవనే గదా సమ్మతము. తిలక్ వంటి సమర్థుడైన కవి మాత్రమే అది నిర్వహింపగలుగును. "అమృతం కురిసినరాత్రి." "నీడలు" అను కవితలలో ధ్వనిని చక్కగా నిర్వహించినాడు. ప్రాచీన సంప్రదాయపు గుణముల యెడ గౌరవమున్న తిలక్ వానిని త్రోసిరాజని కవిత్వమును వ్రాయలేదు. పైగా కవిత్వమును, తల్లక్షణములను సైతము వివరించి యుండ కాదనుటెట్లు?

ఛందోవ్యాకరణ గ్రంథములు చేసిన పాప మేమో తిలక్ వానికి మాత్రమే శిక్షవేసినాడు. కాని మరేవిషయము నందును ప్రాచీన కవివరేణ్యుల నిత్య నూతన సార్వకాలిక సత్యములనుండి విడివడలేదు. అందుకు తిలక్ అభినందనీయుడు. అపరవిశ్వామిత్రునివలె శ్రీశ్రీ వచనకవితా శకుంతలకు జన్మనిచ్చి ఆగ్రహోదగ్ర దృక్కులతో వదలించి తిరస్కరించినాడేతప్ప సాకతము సేయలేదు. అర్హతలేని అధమాధముల పాలబడి చులకనయైపోతున్న ఆపిల్లను కణ్వునివలె చేరదీసి పోషించి, సంస్కారోపేతనుగా తీర్చిదిద్ది నవోఢగా అలంకరించినవాడు తిలక్. పౌరిక దుష్యంతుల కిచ్చి పరిణయ మొనర్చినాడు. కాలగతిని మగటిమిలేని మగలు మరతురో ఏమో!

ఈ చందాన తిలక్ తన గ్రంథము నందు మన ప్రాచీన సంస్కృతి సాహిత్యములయెడ అపారగౌరవము ప్రదర్శించి ఆధునిక సాహిత్య ప్రక్రియను పరిగ్రహించి మనగలిగిన కాలానికి నిలబడగలిగిన లక్షణములను జోడించి ప్రాతక్రొత్తల మేలుకలయికగా తన కావ్యమును తీర్చినాడు- అభ్యుదయ కవితాయుగ శంఖమును పూరించిన తిలక్‌కు ప్రాచీనత యెడ వ్యామోహమేమి? అని అందురా?

"మాధుర్యం సౌందర్యం కవితా
మాధ్వీక చషకంలో రంగరించి
పంచి పెట్టిన
ప్రాచేతస కాళిదాస కవిసమ్రాట్టులనీ
వ్యాహో వ్యూహోత్కర భేదనచణ
ఉపనిషదర్థ మహోదధినిహిత మహిత
రత్నరాసులనీ
పోగొట్టుకునే బుద్ధిహీనుడెవరు?"

అంకితం -
మానవతామూర్తి, అక్కకు.

—•••—

# వేసవి వర్ణన - శ్రీకృష్ణదేవరాయ, రఘునాథరాయలు:

- శ్రీ డా. యస్. గంగప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.

వేసవివర్ణనలో రఘునాథరాయలు శ్రీకృష్ణదేవరాయల్ని అనుసరించాడు. స్వతంత్రత ఉన్న రఘునాథ నాయకుడు స్వల్పంగా అనుసరించినట్లు కనిపిస్తుంది. శ్రీకృష్ణదేవరాయలు రఘునాథ నాయకునికి అన్నివిధాలా ఆదర్శపురుషుడు. పైపెచ్చు కృష్ణదేవరాయలతో అన్నివిధాలా సరితూగగలవాడు రఘునాథుడు. శ్రీకృష్ణదేవరాయలకు సాహితీ సమరాంగణసార్వభౌముడన్నది బిరుదం. అలాగే ఇది రఘునాథునకుకూడ వర్తిస్తుంది. ఇద్దరూ అటు కదనరంగంలోను, ఇటుకవితారంగంలోను అసామాన్య శేముషీవైభవాన్ని ప్రకటించి అశేష ధైర్య సాహసాల్ని వెలువరించి చక్కటి కవిత్వంచెప్పి, విజేతలై విజయ దుందుభులు మ్రోగించిన మహారసికకవులు, వీరులూను. రాయలకు భువనవిజయంలాగ నాయకునకు 'ఇందిరామందిరం' విద్వద్గోష్ఠులకు ఉపకరించింది. ఇద్దరూ తీసుకొన్న వస్తువులలో, చేసిన రచనా విధానంలో విలక్షణత గోచరిస్తుంది. ఇద్దరూ రాజకవులు కవిరాజులూను. కృష్ణదేవరాయలు తదితర సమకాలిక కవులకంటె విలక్షణంగా ఆముక్తమాల్యదను రచించి,తరించాడు. మోహశృంగారం తన కాలంనాటి కావ్యాల్లో మోహరించి ఉండగా రఘునాథుడు రామాయణం రచించిన ఆదికవి వాల్మీకి చరిత్రనే రచించి తనవిశిష్టతను ప్రకటించుకొన్నాడు. ఈ ఇద్దరు కవితల్లజులు తమ ప్రబంధాల్లో చేసిన వేసవివర్ణనను తిలకిద్దాం.

ప్రబంధాలకు అష్టాదశవర్ణనలు జీవానిలాలు; తద్విరహితంగా ప్రబంధా లనిపించుకోవు. ఈ అష్టాదశవర్ణనల్లో ఋతువర్ణనలు ప్రాధాన్యం వహిస్తాయి. కథ కనుగుణంగా ఔచిత్యంతో ఈ ఋతువర్ణన చేసి తన ప్రత్యేకతను నిలబెట్టుకొన్నవాడు శ్రీకృష్ణదేవరాయలు. సందర్భోచితమై అతికినట్లు గ్రీష్మ,వర్ష, శర,ద్వసంత వర్ణనలు ఆముక్తమాల్యదలో చేసినరీతిని పరిశీలిస్తే కృష్ణదేవరాయల విశిష్టత గోచరిస్తుంది. ఇలాగే అవసరంలేకపోయినా అన్ని ఋతువుల వర్ణనలూ చేయాలన్న కాంక్షలేక, ఔచితీసహంగా అవసరమైన వర్ణనలు మాత్రమే చేసినవాడు రఘునాథుడు. వాల్మీకిచరిత్రలో మొత్తంమీద గ్రీష్మవసం

తరువాత వర్ణనలుమాత్రమే ఉన్నాయి. ఇదే రఘునాథుని విశిష్టత. సందర్భోచితమై, అతికినట్లుండి సముచితంగా ఉన్నాయి.

పాండ్యరాజైన మత్స్యధ్వజమహారాజు సామ్రాజ్యవైభవం అనుభవిస్తూన్న సమయమందలి వేసవివర్ణన ఆముక్తమాల్యద రెండో ఆశ్వాసంలో అమోఘంగా చేకాడు శ్రీకృష్ణదేవరాయలు. ఇరవై ఐదు పద్యాల్లోవిపులంగా జరిగిం దీవర్ణన. సప్తర్షులు తీర్థసందర్శనార్థమై బయలుదేరి ఆయా తీర్థాల్ని సందర్శిస్తూ కాశీపట్టణం దర్శించి, మణికర్ణికలో స్నానాలుచేసి, కాశీవిశ్వనాథుని సేవించేలోపల వేసవి ఆరంభమైనట్లు వాల్మీకిచరిత్ర రెండో ఆశ్వాసంలో అభివర్ణించాడు రఘునాథరాయలు. పధ్నాలుగు పద్యాల్లో ఉం దీవర్ణన. శ్రీకృష్ణదేవరాయలు ఈ వేసవివర్ణనలో ఉత్ప్రేక్షాలంకారాన్నే ఎక్కువగా ఆశ్రయించినా, స్వభావోక్తినిసైతం ఏడెనిమిదిపద్యాల్లో ప్రయోగించడంవిశేషం. పైపెచ్చు రాయలలోకజ్ఞత అడుగడుగునా కనిపించి, మనల్ని ఆశ్చర్యచకితుల్ని చేసి, ఆనందవార్ధిలో ముంచితేల్చుతుంది. ఇది రాయల ప్రత్యేకత. రఘునాథుడు కొద్దిగా రాయలను అనుసరించినా తనప్రత్యేకతనుసైతం నిలబెట్టుకొన్నాడు.

వేసవి రాగానే నదీప్రవాహాలు ఇంకిపోగా, చెట్రాలలో పేరినపాచి పెద్దగా బీటలు వారిం దనివర్ణించాడురాయలు. ఇది స్వభావోక్తి. ఇందు రాయల లోకజ్ఞత స్పష్టమవుతుంది. ఎండమావులవల్ల అన్ని దిక్కులు భైరవునికోసం ఉతికినచీరలు ఆరగట్టిన చాకిరేవులో అన్నట్లు గోచరించాయని రాయలు ఉత్ప్రేక్షించడం మనోజ్ఞం. ఇలాగే రఘునాథుడు భైరవునిత్రినేత్రాగ్నిలోని వేడి మేలోకమంతా వ్యాపించిందో అన్నట్లు "గ్రీష్మ మతిభీష్మంబై" తోచిందని ఉత్ప్రేక్షించారు. ఉత్ప్రేక్షలోనులోకసామాన్యమైన ఉతికినగుడ్డలు, చాకిరేవులు చెప్పడంలో రాయలలోకజ్ఞతమూలంగా సహజతే వ్యక్తమవుతుంది. వేసవినీళ్ళు సూర్యరశ్మిచే హరింపబడగా మెరబెట్టుకొంటూ వెళ్లుతున్న పాడు బావులో అన్నట్లు సుళ్లు తిరుగుతూన్న సుడిగాలులు వ్యాపించాయనిరాయ లంటే

"సుడిగాలి ధూళి జుట్టుచు
వడిగానందందతిరిగె వలయంబగు మున్
బుడమి యను బరణిఁ దెరఁ దిరి
గెడుకీలనఁజాలనట్టి గ్రీష్మమునందున్" (2-78)

అని వర్ణించాడు రఘునాథుడు.

ఇంతకంటె కృష్ణదేవరాయలు

'పడమర వెట్టు నయ్యెడుకు
ప్రాశన మొల్లక కూటిపేదలై
బడలిక నూడు నచ్చిలువ
ప్రగ్గములన్ రవియాజ్ఞ మాటికిన్
ముడియిడఁ బిమ్మగంటు రథ
మున్నిలు పన్నయనంబు సాగమిన్
జడను వహించె నాగ దిన
సంబులు దీర్ఘములయ్యె నత్తఱిన్' (2-49)

అన్న పగటిపూటలుదీర్ఘంకావడానికి హేతువు నుత్ప్రేక్షించాడు. పశ్చిమదిక్కునుండి వీస్తూన్న గాలివేడిగావడంవల్ల.దాని నాహారంగా స్వీకరించనికూటిపేదలై బడలికచేత ముళ్లువీడిపోతూ ఉన్న రథాశ్వాల పగ్గాలైన సర్పాలనుడి బలపడడానికి సూర్యునిఆజ్ఞతో సారెసారె రథసారథి అనూరుడు రథం నిలపడంవల్ల ప్రయాణవేగం మందగించెనేమో అన్నట్లు గ్రీష్మకాలమందలిపగటిపూటలు దీర్ఘములయ్యాయట. ఇలాగే ఉత్ప్రేక్షాలంకారంలో పగటిపూటలు దీర్ఘంకావడానికి గల కారణాన్ని రఘునాథుడు వర్ణించాడు.

"బడిచను దెంచుచాయ ధరఁ
బాంథుల తాపము తీర నక్కడ
క్కడఁ దరుజాల మూలములఁ
గ్రమ్ముచునిల్వఁగ దానిగ్రుచ్చుకో
వడిఁ గరపాళి యొత్తి దిన
వల్లభుఁడల్లన సాఁగెనాఁగ న
య్యెడ నతిదీర్ఘభావము వ
హించె నహంబు లహోమహోగ్రతన్ (2-73)

బాటసారులను ఎండనుంచి రక్షించడానికి ఛాయాదేవి చెట్లమూలల్లో నిలబడిపోతూ ఉండగా ఆమెను తన కరాలతో గ్రహించి తనతోపాటు కొనిపోవడానికో అన్నట్లు సూర్యుడు సాగాడట. అందుచేత ఆలస్యమైంది. ఆ ఆలస్యంతో అహస్సులు దీర్ఘమయ్యా యన్న కారణం చెప్పాడు రఘునాథుడు. అందు 'పయనంబు సాగమిన్ జడను వహించెనాఁగ దివసంబులు దీర్ఘములయ్యె నత్తఱిన్.' ఇందు 'అల్లన సాఁగె నాఁగ నయ్యెడ నతిదీర్ఘభావమువహించె నహంబు లహోమహోగ్రతన్'. రెంటిలోను ఉత్ప్రేక్షాలంకారమే. అనుసరణ ఉన్నా రాయలకంటె సహజంగా, సరళంగా చెప్పాడు రఘునాథుడు. ఇది ఈతని స్వతంత్రత. రాయల రచనలో ఇంకా సూర్యుని వేడిమి కాల్చగా గాలివల్ల పైకెగసిన బూడిదసమూహమేమో అన్నట్లు బూరుగు దూది ఆకాశాని కెగసిం దట. పర్జన్యునికి లంచమివ్వడానికి నాణాలతో చేతులు పైకెత్తినవేమో అన్నట్లున్నాయట నీరింకిన నదులు, ఇంకా-

'మెండుమీఱిన పగటిబీఱెండ దాఁకి
యొల్లఁబోయిన లేబొండు మల్లెవొదల
తుదలఁ జప్పడలై కడుదొడ్డ లగుచుఁ
బొడమె మొగ్గలగము లగ్గిబొబ్బలట్లు'. (2-56)

అని ఉత్ప్రేక్షించడం రాయలకే చేతనవుతుంది. కాగా-

'ఎసఁగుకట్టావిక్రియ నావిరెగయఁ బగటి
యెండయుడుకు కాఅవుడు భూమండలమున
బొలిచె మాపటఁ బండువెన్నెల చకోర
పోతవితతికిఁ జాపట్టువోసినట్లు.' (2-60)

అని చెప్పడంరాయలలోకజ్ఞతకునిదర్శనం. అతిశయించిన ఆవిరేమో అన్నట్లు వేసవి ఎండవేడిమి అరని భూమిపై మాపటివేళ చకోరపక్షుల కోసం 'చాపట్టు' వోసి

నట్లుగా పండువెన్నెల ఒప్పిందని రాయలు ఎంతో చక్కగా ఉత్ప్రేక్షించాడు. ఇలాగే

అట్టివేసవి బెడిదంబు వెట్టక తన
హస్తము సెమర్చి సారెకు లస్తకంబు
దునికిలఁగఁ గాదె సవరింపవసముగాక
పుష్పబాణుని చెఱకు విల్పుడమిఁబడియె'
(2-65)

-అని ఉత్ప్రేక్షించాడు రాయలు. రాయల ఈపద్యంలోని మొదటి పాదం యథాతథంగా వాడుకొన్నాడు రఘునాథుడు-

'అట్టివేసవి బెడిదంపు వెట్టకతన
నేల నందంద విరిసిన నెఱియలందుఁ
దరణి పాదంబు నెడనెడఁ దవుల మెల్లఁ
దివిచికొని పోవ దివసంబు దీర్ఘమయ్యె'
(2-74)

అయితే ఇక్కడి విషయం వేరు. 'బడిచనుదెంచు' (2-73) పద్యంలోని భావాన్ని మరోవిధంగా చెప్పుకున్నాడు రఘునాథుడు. ఏమైనా రాయలమీద ఎంతో గౌరవముంటేకాని రఘునాథుడు యథాతథంగా గ్రహించగలడా? ఆమాత్రం రచించడం తనకు చేతకాకకాదు. ఆ రచనమీది గౌరవమే ఇంత చేసింది. 'తరుణుల్' (2-66)అన్న రాయలపద్యంలో చక్కటి ఉత్ప్రేక్ష ఉంది. ఇది మనోజ్ఞమైన భావన. 'గ్రామ గ్రామంబున' (2-69) పద్యంలో వేసవిలో భూమిపై కుంపటిలోని తామరలో అన్నట్లు చలవేందిరాలున్నాయట. 'తోటఁబగలుండి' (2-70) పద్యంలో వర్షాన్ని సూచించడానికి గుడ్డుతో గూడ వచ్చే ఎఱ్ఱచీమలా అన్నట్లు ప్రజలున్నారంటాడు రాయలు. ఇవన్నీ ఉత్ప్రేక్షాలంకారానికి ఉదాహరణలు.

ఇక రాయలు స్వభావోక్తితో చక్కగా గ్రీష్మవర్ణన చేయడం గమనిద్దాం. శైలి ఎడనెడ నారికేళపాకమైనా, రాయలు స్వభావోక్తి అలంకార ప్రయోగం చేయడంలో సమర్థుఁడు. వేసవి వర్ణనలో ఈ స్వభావోక్తికి చోటు కల్పించడం విశేషమన్నది పూర్వోక్తం. చేపల వాసనలతో ఒదిగి ఉండి, నత్తగుల్లల్ని, ఎండ్రకాయల్ని తింటూన్న కొంగలకు చెరువులలోని నీరు జానుదఘ్నమైందన్న విషయం 'నులివాడు' (2-53) పద్యంలోను; నీళ్లుండగా పెద్దపెద్ద చేపలను తిన్న పెద్దకొంగలు, వేసవిలో నీళ్ళింకిపోగా బొమ్మిడాలనే చిన్ని చేపల్ని సైతం తిన్నాయని, 'మీటగు మీలనెల్ల' (2-54) పద్యంలోను చక్కగా వర్ణించాడు రాయలు. ఇంతకంటే ముఖ్యంగా ఏతంఎత్తేప్పుడు ఉదయాన బొక్కెనల శబ్దం మద్దెల ధ్వనిలాగా ఉండగా, ఏతంతోడేవాళ్ళు పాడుతూన్న పాటలు ఎంతో మనోజ్ఞంగా ఉన్నాయంటూ-

'ప్రాతర్వేళల నెట్టి వెట్ట సొగసై
పాటిల్లెఁ గుంభోంభనో
ద్భూతాంబుధ్వనివాద్యమై మరుదధః
పుంజీభవత్పాటల
వ్రాతామ్రేడితసిక్తభూసురభిళా
రామాంబుకుల్యాబహు
స్రోతస్సంధుల నందుయంత్రనతికృ
త్ప్రోద్గీతగేయౌఘముల్' (2-55)

-పద్యంలో వర్ణించిన లోకజ్ఞత స్పష్టం. కాగా-

'తారుణ్యాతిగ చూతనూత్న ఫలయు
క్తైలాభిఘాత స్వన
ద్ధారాధూపితశుష్క దంబుహృతమా
త్స్యచ్ఛేదపాకోద్గతో
ద్గారంపుం గనరార్చు భోగులకు సం
ధ్యావేళలం గేళికాం
తారాభ్యంతరవాలుకాస్థిత హిమాం
తర్నారికేళాంబువుల్' (2-68)

పద్యంలో వేసవిలో భోగులు క్రొత్త మామిడి ముక్కల్ని తాలింపు వేసివండిన చేపల కూరతో భోజనం చేయగా కలిగిన కనరును పోగొట్టుకొనుటకై ఉద్యానవనాల్లో ఇసుకలో పాతిపెట్టిన కొబ్బరికాయల్ని బయటికి తీసి వాటి నీళ్ళను సాయంకాలం తాగుతూంటారు అంటాడు రాయలు. ఇది బహుశః తన అనుభవమే! ఇలానే రఘునాథుడు -

'పట పట పగిలెం గుంభిని
తటపట పథికులమనంబు తల్లడపడియెన్
చిట చిట నెగసెన్ దవశిఖి
కటకట గ్రీష్మంబొకింత కనఁబడునంతన్'
(2-72)-

అని స్వభావోక్తిని చక్కగా ప్రయోగించడం గమనించ దగ్గది.

రాయలు వేసవి వర్ణన సందర్భంలో హాస్యం పరిపోషించి ఉండటం మరీ విశేషం. ఇందు తన శృంగార ప్రియత్వానికి హాస్యం ఆధారభూతమైంది.

'తోడఁబడ నమ్మలక్కలని
తూలుచు దీనత దోసిలొగ్గుచున్,
వడముడి తేరఁ దేర, నల
వాక్యము లెన్నక, మోము గుబ్బలున్
గడుకొను కక్షదీప్తులు నె
గాదిగఁ గన్గొను చిట్టికంబుఁ ద్రాఁ
గుడుఁ, గనిసన్నల న్నగిరి
క్రోల్పక పాంథుఁ బ్రపాప్రపాలికల్.'
(2-59)

-వేసవిలో బాటసారులు దాహంతో అమ్మా! అక్కా! అంటూ దీనంగా దోసిలొగ్గిన చో, చలివేందిరాల్లోని స్త్రీలు నీరుపోయగా, త్రాగి కొంత సేద దేరిన ఆ బాటసారులు ఆ స్త్రీల కన్నులు, ముఖాలు, స్తనాలు, కక్షభాగాలు చూస్తూండగా - ఆ స్త్రీలు నవ్వారట వారికాముకత్వాన్ని గమనించి. ఇందులో హాస్యం పోషించడం రాయలకే సాధ్యమైంది.

ఇలాగా శ్రీకృష్ణదేవరాయలు అనన్యసామాన్యంగా ఋతు వర్ణన చేయడం

## వాగ్దేవి

– శ్రీ వెలుదండ నిత్యానందరావు

నన్నయ కవిచంద్రు నవ్యసౌధంబున
లలితమౌ పలుకులు పలుకనేర్చి
తిక్కనామాత్యుని దివ్యాంగణంబున
తగురీతి బాల్యంపు దశనుగడిపి
శ్రీనాథ కవిరాజు శీతాంశుశాలలో
యౌవనదశయందు నడుగుఁబెట్టి
పోతనామాత్యుని పుష్పవనంబున
విరి తేనియలగ్రోలి పరవశించి

ప్రభువు శ్రీకృష్ణరాయల పాలనమున
విజయనగరపు వీథుల వేడ్కతోడ
అందలమ్మెక్కి యూరేగినట్టితల్లి!
ఆంధ్రవాగ్దేవి! జేజేలనందుకొనుము.

నన్నపార్యుని సుప్రసన్నకథాయుక్తి
తిక్కనామాత్యుని తెనుగుదనము
శ్రీనాథభట్టు విశేష ధారాశుద్ధి
పోతనామాత్యుని పోహళింత
పెద్దనార్యు శిరీష పేశలత్వంబును
ముక్కుతిమ్మకవీంద్రు ముద్దుపల్కు
సూరనామాత్యుని సుందరకల్పన
ధూర్జటివర్యు మాధుర్యమహిమ

ప్రభువు శ్రీకృష్ణరాయల పాకపటిమ
చేమకూర వేంకటకవి శ్లేషగుణము
ఎదదలంచియే గటంబు నెత్తుకొంటి
పలుకుదయసేయుమా! వాణి నలువరాణి!

---

( 12 వ పేజీ తరువాయి )

లోను, తన ప్రతిభాలోకజ్ఞతల్ని ప్రకటిస్తూ వేసవివర్ణనను గావించడంలోను, తన ప్రత్యేకతను నిలబెట్టుకొన్నట్లు స్పష్టమైంది. అదేవిధంగా రఘునాథ రాయలు సైతం ఎడనెడ అనుసరించినా కృష్ణదేవరాయలతో అన్నివిధాలా తన సాదృశ్యాన్ని, స్వతంత్రను చూపినట్లు సువ్యక్తమైంది. శ్రీకృష్ణదేవరాయలు రఘునాథరాయలు ఇద్దరు రాజకవులే కాదు, కవిరాజులూను, అనడం అతిశయోక్తి కాదు. స్వభావోక్తి! *




## శ్రీ వాల్మీకి రామాయణము

[ప్రథమ సంపుటము బాలకాండ, అయోధ్యాకాండ. గ్రంథకర్త: ప్రకాశకులు: శతాధిక గ్రంథకర్త, ఆర్ష కవి శిరోమణి విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు, ఎం. ఏ; (ట్రిబుల్) శ్రీ అన్నవరం సత్యవతీదేవీ స్త్రీల ప్రభుత్వ కళాశాలాంగ్ల భాషాధిపతి, 8-22-14 పట్టాభివీథి, గాంధీనగరం. కాకినాడ 533004, వెల రు 50. $\frac{1}{4}$ క్రౌను పెద్ద సైజు 416+16+20 పుటలు.]

శ్రీ వాల్మీకి రామాయణము జగత్ప్రసిద్ధము. దానికి దేశీయ విదేశీయ దూరదేశీయ భాషలలో ఎన్నో అనువాదములు వెలసినవి. అనువాదములు కొన్ని అనుసరణములు కొన్ని, పరివర్తనములు కొన్ని, ఛాయానువాదములు కొన్ని, ఎన్నోరకములు మున్ను వెలువడినవి. ఇటీవలి కాలములో శ్రీరామాయణ కల్పవృక్షము వెలువడినపిదప, కల్పవృక్ష ఖండనము, శ్రీరామాయణ విషవృక్షము, శ్రీరామాయణ విషవృక్ష ఖండనము మున్నగున వెన్నో కొల్లలుగా బయలుదేరినవి. వావిలి కొలనువారి "వాల్మీకి రామాయణము," జనమంచి శేషాద్రి శర్మగారి "ఆంధ్రశ్రీమద్రామాయణము" మూలమునకుఁ జాలసన్నిహితానువాదములు. గోపీనాథ రామాయణము అంతియే. కాని, భాస్కర రామాయణము, రంగనాథ రామాయణము మున్నగునవి కేవలానువాదములు కా ఇంతవఱకు తెలుగునవచ్చిన అనువాదములు వ్యాఖ్యాతల భావములతో విపులీకృతములు. అతివ్యాప్తి దోషములు కలవి. అవ్యాప్తి దోషములు కలవి కొన్ని.

"సులభసుందరమౌ ననుష్టుప్పులోన
వ్రాసె వాల్మీకి సంస్కృతభాషయందు
అంతసులభమౌ ఛందస్సు నందెవండు
శ్రీకరంబుగ నాంధ్రీకరింపలేదు."

కావున, ఈ ప్రయత్నము. పైఁగా

'వ్రాయుము యథాతథంబు రామాయ
ణంబు, తేటగీతల భావార్థదీప్తి మెఱయ"

అని రామాజ్ఞ.

"సులభ సుందర ఛందము సొంపుమూల
భావసౌందర్య పోషణ ప్రస్ఫుటముగ
భక్తిఁ బ్రారంభ మొనరించి వ్రాయుమోయి
అనుసరింప కంథముగ వ్యాఖ్యాత నెవని.
వృత్తములువాడె వాల్మీకియెచ్చటెచట.
వాడు వృత్తంబు లచ్చోట వాసిమీఱ."

అనియు రామాజ్ఞ. దీనినిబట్టి చర్విత చర్వణము, పిష్టపేషణము అని పామరులనుకొనుటకు వీలుగా మరల రామాయణమే వ్రాయుటేల అని అడుగువారికి సమాధానము లివి. 1. ఇది భ్రాతృసుతుని కోరిక, 2. రామాజ్ఞ. 3. తేటగీతలలో వ్రాయుమని 4. వ్యాఖ్యాతల నంధముగా ననుసరింప వద్దని 5. మూలమున వృత్తములుగలచోట వృత్తములే వ్రాయుమని 6. భక్తితో వ్రాయుమని 7. సులభసుందర ఛ్ఛందస్సు సొంపు నింపుమని 8. మూల భావసౌందర్య పోషణ ప్రస్ఫుటముగ నుండవలె నని-నియమములను రాముడే యేర్పఱిచెను. మూలము నిర్వచనము. ఇదియు నిర్వచనము. ఈ చక్కని పద్ధతులను రామాజ్ఞ కాగా సృష్టించుకొని శ్రీవాల్మీకి రామాయణ రచన శ్రీ వేంకటేశ్వరులు కావించినారు. శతాధిక గద్య

పద్యనాటకాది కర్తగా ఆయన చేయి తిరిగిన, ఆరితేరిన కవి. ఫలితము శ్రీవాల్మీకి రామాయణాంధ్రీకృతి. ఈపై నియమముల ననుసరించి యిదివఱ కెవ్వరిది వ్రాయలేదు. కాన శ్రీ వేంకటేశ్వరుల కృతి ఒకవిధముగ నవీనమే.

ప్రస్తుతము విడుదలకు వచ్చిన గ్రంథము బాలాయోధ్యాకాండలుగల తొలి సంపుటము. ఇదే రాయలు సైజులో 450 పుటలైనది. రెండు పాదములు గల అనుష్టుప్ శ్లోకమున కిందు నాలుగు పాదముల గీతము వచ్చినది కనుక, సైజులో వాల్మీకమున కెట్టింపైనది. అట్లని వ్యర్థపదములు లేక డొంకతిరుగుడు లేక అన్వయ క్లిష్టత లేక, గ్రంథమంతయు ఒక్క వరుస నడచుట మిక్కిలి శ్లాఘ్యము.

బంగారుతీగవలె పద్యమును సాగించు విద్యలో శ్రీ వేంకటేశ్వరు లందెవేసిన చేయి. దశరథుఁడు

"అహితులం గెల్చి హితుల సమాదరించి
నిత్యవిజితేంద్రియుండయి నెగడి ధనద
శక్రతుల్యతఁ గాంచి యైశ్వర్యములను
మనువువలెనె ధర్మపరిపాలన మొనర్చె.

అయోధ్యాకాండలో శైలి మరి యును పాకమున పడినది. అది గంగా ప్రవాహమే :

"రాఘువుని జూడలేని నిర్భాగ్యులకును
గృహము లవియేల భార్యలిం కెందులకయి
కొడుకు లెందుకుఁ దమకొనగూడునట్టి
సుఖము లెయ్యవి సర్వము శూన్య మగును.
సీతతో దండకావన సీమ కేఁగు
రామచంద్రుని పరిచర్యకై ముదమున
వెంట నేగిన లక్ష్మణ వీరుఁ డొకఁడె
నెగడె సత్పురుషుం డయి జగములందు.

దీనిమూలము :

"కిం ను తేషాం గృహైః కార్యం
కిం దారైః కిం ధనేన వా
పుత్త్రైర్వా కిం సుఖైర్వాపి
యే నపశ్యంతి రాఘవమ్.
ఏక స్సత్పురుషో లోకే
లక్ష్మణస్సహ సీతయా
యోనుగచ్ఛతి కాకుత్స్థం
రామం పరిచరన్ వనే.

దీనినిబట్టి యెంతసులభ సుందరముగా రసభరితముగా శ్రీ వేంకటేశ్వరుల యనువాదము నడచినదో తెలియును.

వాల్మీకి చెప్పినది యథాతథముగా తెలుగువారికి చెప్పుటే శ్రీ వేంకటేశ్వరుల లక్ష్యము. వాల్మీకి వ్యంగ్యముగా చెప్పిన చోట వ్యంగ్యముగాను వాచ్యముగా చెప్పినచోట వాచ్యముగనే వీరు చెప్పిరి. సరసాను సరణమే వీరిపని. మూలమునకు మెఱుగు పెట్టుట, వాల్మీకినిమించుట మున్నగు మాటలు వీరి దృష్టిలో పిచ్చిమాటలు.

ఏ శ్లోకమున కాశ్లోక మెంత మేలఁకువతో వీ రనువదించినది మూలము దగ్గర పెట్టుకొని వీరి యనువాదము చదివిన వారికి తేటతెల్లమై ఆశ్చర్యము గొలుపును. రామాయణము వంటి మహాగ్రంథము లేదని అంతకంటె వాల్మీకు శరణ్యము నేటికే కా దేనాటికి లేదని భక్తి భావముచే వీరీ రచనకు పూనుకొనుటచే అనువాదమువలెగాక స్వతంత్ర గ్రంథము వలె నిది చక్కఁగ సాగినది. పరమపవిత్ర మగు కవితా పరిపాకమును పరమ పవిత్ర కావ్యానువాదమున వ్యయించి శ్రీ వేంకటేశ్వరులు ధన్యులై తెలుగుతల్లికి మనోజ్ఞ మహితస్వర్ణ భూషణ మొసఁగి తెలుగు వారిని ధన్యులను జేసినారు.

శ్రీ వేంకటేశ్వరులు మిగిలిన సంపుటములను త్వరలో ప్రకటింపగలరని ఉత్తరోత్తర రసభరితము లవికాగలవని నిత్య నూతనము లవి అగునని ఆశించు చున్నాము. - శ్రీ సుప్రసన్న.

# దీనరక్షక శతకము

కవి: శ్రీబయ్యపునేడి వెంకటజోగయ్యగారు. ప్రతులకు శ్రీ బి.వి. జోగారావుగారు సబ్‌పోస్టుమాస్టరు. ట్రంకురోడ్డు జంక్షను, రాజమండ్రి. వెల తెలియదు.

వాఙ్మయ వృక్షమునకు గల శతకశాఖ మిక్కిలి విస్తరించినది. అందు ప్రధానమైనది భక్తిశాఖావిలాసము. దానిముందు మిగిలిన శతకశాఖల వికాసము తక్కువ యనిపించును. అట్లువచ్చిన భక్తి ప్రధాన శతకములలో (అర్వాచీనములలో) దీనరక్షకశతక మొకటి. దీనిని రచించిన వారు శ్రీబయ్యపు నేడి వెంకటజోగయ్యగారు. విజయనగర సంస్థానాధీశ్వరుల వలన బహుమాన మందిన కవులు వీరు. లోకమాన్య శతకము మున్నగువానిని రచించి ప్రశస్తి నందినవారు. పునర్ముద్రణ మందుటయే దీని ప్రశస్తిని వెల్లడించును. దీనిని ప్రకటించినవారు వీరిపౌత్రులు.

వీరికవిత్వము ప్రశంసనీయము. ధారానైశిత్యము కలది. వీరి రచనలో నిజమైన యావేదన కనిపించును. 42 పద్యము వంటివి దీని కుదాహరణములుగా నీయ వచ్చును. పట్టితి మీపద్యయుగ(29)వంటి పద్యములు వీరికి గల నిరంతరభాగవ తానుశీలనమును వ్యక్తపరచును. కొన్ని పద్యములకు గుర్తుపెట్టుట యేలనో తెలియదు. అట్టివానికి వలసిన జ్ఞాపిక లిచ్చినచో బాగుండెడిది. విమలంబై విశదంబునై (20) వంటిపద్యములు వీరి భావనాబలమును శబ్దశక్తిని సూచించును. (5)

పెక్కఁబహువిధంబుల బ్రోచిన తీఱువిన్న నాకగుడుగ నాశ పుట్టె' ఇట గ్రేకేగి పదము విచారణీయము. 7 లో, భవదీయ దాసునిగనీ వెంతే గదా!' ఇది యున్నట్టిదే 22 లో నన్వయ క్లేశము కలదు. 24 లోని' అనన్వయము నిట్టిదే. 26 సత్కథామృతపుధారల గ్రోలెడి జిహ్వాజిహ్వ- సత్కథామృతమును చెవులు

## అదృష్టము

- శ్రీ జమదగ్నిశర్మ, ఎం.ఏ.

నా యదృష్టమ్ము సత్య మనన్య లభ్య
మమ్ము దయఁజూడ మనుజ జన్మమ్ము వచ్చెఁ
బూర్వ పుణ్యాన ఆస్తిక్య బుద్ధి కలిగె
బ్రదుకుచుంటిని దైవభావమ్ముతోడ ॥

అనుకొనిన దైవఁ బెరుగు నహమ్ము గానఁ
గాదు నాజీవితాన నిక్కమ్ము సుమ్ము
ఏల తలపోతలనుచు యదృచ్ఛ నేది
లభ్యమగుదాన నందుదు హ్లాద మెపుడు॥

పగలు చూచిన రాత్రి స్వప్నమునఁ దోఁచు
రూపముండుట గర్వమే రూపుగొనదు
దీని కేమానొ యనెడి భీతియును లేదు
పనిజరుగుచున్నదది మహాభాగ్యమగును॥

ఆయువున్నది యారోగ్య మసలు లేదు,
ఆశలున్నవి యైశ్వర్య మమర లేదు
గ్రాసవాసంబులకుఁ దగు గడనకలదు
నన్ను లోకమ్ము నెంచు మనస్సుకలదు॥

పెద్ద పనివాఁడ ననుచుఁ జెప్పికొనలేను
గాని కదలాడు గుండియు కలదు గాన
జీవిత పుటూపు అందు నార్జించుకొన్న
యనుభవంబుల ననెదు నేర్చిన విధాన ॥

కథలును కైతలున్ విరివి
గా పలికించెను తల్లి, కొంతగా
ప్రథితుఁడ నైతి, నచ్చుపడు
భాగ్యము పట్టిన పట్టకున్న, నా
మథనము వ్యర్థమానె? యది
మానక యాకస మందులీనమై
బుధుల హృదంతరాళములఁ
బొంగఁగఁ జేయును గాల మబ్బినన్॥

పలుకఁ జేసియుఁ బలికించు పలుకు వ్యాప్తి
పొంద నీకింటఁ జేవ్రాత పొత్తములను
పేర్చుచుంటయు మంచికే పేర్చి పేర్చి
తానె వహియించు భారంబు తల్లి తుదకు॥

ఎందున మోహముం గనక
యెప్పుడు తన్ను స్మరించుచుండు సం
స్పందన శీలమానెడద
వత్సలతన్ వసియించు తల్లి యా
నందము కాక నా బ్రదుకు
నందు కొఱంత సుమంత లేదు ని
న్నందెద నెట్టులో జనని!
యంతము దాకిటు సాగనీయవే!

ఋణమున్ రోగము బాధ్యతల్ మిగులఁ
దల్లీ! నిన్ను ధ్యానింప కే
జనుఁడుండున్ భవదీయ సంస్మరణ
నిచ్చున్ నిల్పు భావంబులో
డనె నన్నిట్టులు తీర్చి, తింక నిను నం
టన్ గ్రాగెదన్ నీవు నే
నను వైవిధ్యము కాన రానటులు
ధన్యోఽహం జగన్మాతరో!

—...—

( 14 వ పేజీ తరువాయి )

వినుమగదా!- పలుకనప్పుడు జిహ్వకు ప్రాధాన్యమున్నను తదనుభవము లో లేదు కదా. 27 లో నమ్మి, ఏలుకొమ్మి, కావగమ్మి, కరుణింపలెమ్మి, వంటివానిలో ఇత్వము విచారణీయము. 31 లో భయార్తుల్లోల' అన్వయము కుదురదు. 35 లో- అనివార్యమున స్మదినాట జేయగా వీనికిని అన్వయము విచారణీయము. 39 లో' పట్టగరాని మహోద్ధతిన్ గదా యలుగునె' క్రీగీటు విచారణీయము. 41 లో నాయజ్ఞతకన్న మేర నహీ యాశలు చూడ, క్రీగీటు విచారణీయము.

ఇట్టి వున్నను నీశతకము తప్పక చదువ దగినది. ప్రాచీనమార్గాను సరణము, భాగవతాను శీలనము వ్యక్తమగు నీశతకము అవశ్య పఠనీయము. వీరి మిగిలిన రచనలు గూడ ముద్రించిన బాగుండు ననిపించు వీరికవిత్వము ను అసూర్యంపశ్యను గానీయక వీరి పౌత్రులు మిగిలినవానిని గూడ ప్రకాశింప జేయగలరని ఆశింపఁదగును.

- శ్రీప్రసాద్

## వసంతగీతి

- శ్రీ జి. యం. రామశర్మ,
ఎం. ఎ.

ఘనముగా వీచు నీ వడగాడ్పులందు
అవని యంతయు కరము నయ్యాలలూగ
హాయి హాయిగ తనదు నొయ్యార మొలుక
సాగిపోవుచునుండె వసంతలక్ష్మి.

కోయని కోయిలమ్మ లల
కొమ్మలపై సుమనోజ్ఞ రావముల్
సేయగ "ఝుమ్మురుమ్మ"ని వి
శేషముగా నళిరాజు సన్నసా
న్నాయిలుఁ బాడుచుండఁ జిలు
నవ్వులచేత వసంతలక్ష్మి కం-
నోయికి విందొనర్చి కళ
నొప వసంతము నాడుచుండెడున్"

నిన మొన్న చిగురించి నిండుగ కాయలన్
చిన్న చిన్నగఁ గాసె గున్నమావి
ఎల్లర హృదయాల నుల్లాస మొదవగ
అల్లనల్లన వీచె పిల్లగాలి
క్రొత్త క్రొత్తగనగు నెత్తావి వెదజల్ల
వింత వింతగఁ బూసె వేపపూవు
కోమలమ్ముగ నగు కొమ్మలు నలరారు
చెట్టు చెట్టున లేత చిగురు ప్రిదిలె

ప్రముఖ నూతన వత్సరాగమనమునకు
స్వాగతంబిడుచున్నదో యనగ నేడు
నేలనంతను మురిపాల పాలుఁజేసి
సరగు సరగున వచ్చె వసంతలక్ష్మి

—...—

# వలపు నెత్తురు

— శ్రీ సూరం శ్రీనివాసులు.



ఇవె కడసారిచూపుల చె
  లీ! యని పల్కితి కంటితోడ నే
యని సుడి గాలివేగమున
  నందెనో లేదో యెఱుంగఁ గాననో
స్వభవమయి యుండ నావలపు
  దారులతప్పె నశైన జేసెనా
నవమును ప్రేమనెత్తురులు
  పావన మూవని కంకితమ్ముగాన్.

కొండలఁ గోనలందడవిగుండెల
  గూళ్ళల వజ్రఖండమూ
కుండెను దాల్చి యామిష మె
  కోరి మృగంబులఁ బట్టి చంపుచే
యుండఁగ నిల్వఁగా బ్రతుకు
  హాయిగ సాగుచునున్న కాలమం
దెండిన బీడు సేయుటక!
  యేటికి నీవువనంబు జొచ్చుటల్.

సుడిగాలి రేగినా వడలని హృదయము
  చిఱుగాలి తాకిడిఁ జిటిగిపోయె
కత్తులుపొడిచినా కనరాని కన్నీరు
  సుమపరాగమునకె సుడియఁజొచ్చె
పెనుతుపానైనను కనలని చిఱునవ్వు
  నీ కురుల్ గనినంత నీరుగారె
కాఱుచీకటి తెరల్ గట్టినా మాయని
  చూపు నీభావనన్ సోలిపోయె

అడవిజంతువుగా గుండెయమరియున్న
కరుణముసవచ్చి వలపునెత్తురులరుచిని
చూపి విడిపోయినావు నాయూపిరాడ
దింకనానెత్తురేత్రాగనెటనో జనుదు.

పంజానెత్తి వధింతుమన్న నకటా
  భావంబులోఁ గ్రౌర్యమే
పుంజెందంగఁదలంపదార్యజనతా
  పూజ్యాను భావంబులన్
భంజింపంగఁ దలంపదైన నెదలో
  సంధ్యాగ సౌహార్దముల్
రంజిల్లంగ మదీయప్రేమ వనిలో
  రాణింప నెవ్వారిలన్.

చిక్కిశల్యమవుత చివరకు నిహమందు
వలపునెత్తురెటను కలుగకుంట
నన్యజీవిగోరనా ప్రళయాంతమూ
మనిషి నెత్తురొకడె మఱగియుంట.

# ఈ పక్షంలో

శ్రీరామనవమి

## శ్రీ రామశాస్త్రిగారికి సన్మానం

త్యాగరాజనగర్ అడకొలను వారి వీధిలో జరిపిన సీతారామకళ్యాణమహోత్సవాల సందర్భముగా త్యాగరాజనగర్ శ్రీరామభక్తబృందమువారు ప్రముఖ వైణికవిద్వాంసులైన శిష్టు శ్రీరామశాస్త్రి గారిని ఉచితరీతిని సన్మానించిరి.

సన్మానసభకు మున్సిపల్ కమీషనర్ & స్పెషలాఫీసర్ గారైన శ్రీ A. సుబ్బారావు అధ్యక్షత వహిస్తూ చరిత్ర ప్రసిద్ధిగాంచిన రాజమహేంద్రవరములో శ్రీరామనవమి ఘనముగా జరిపేవారని ఈరోజున శ్రీరామనవమి సందర్భముగా సంగీతవిద్వాంసులను గుర్తించి సన్మానించుట అభినందించవలసిన విషయమని పేర్కొన్నారు. గానకళ సంపాదకులు శ్రీ మునుగంటి శ్రీరామమూర్తి గారు (కాకినాడ) సభాప్రారంభము చేస్తూ మన కున్న కొద్దిపాటి సంగీత కుటుంబాలలో శిష్టువారి దొకటని, అట్టి శిష్టువారి వంశరత్నం శ్రీ రామశాస్త్రిగారిని సన్మానించటము చాలా ఆనందదాయకమని చెప్పినారు.

శాస్త్రి గార్ని ఆంధ్రపురాణకర్త శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారు చందన తాంబూలములతో పాటునూతనవస్త్రములతో, సరస్వతీచిత్రముతోను సత్కరించుటయేకాక వారు చేసిన అనర్గళోపన్యాసములో శాస్త్రి గారి ముత్తాతగారైన శ్రీ శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారు సంగీత సాహిత్యములలో నిష్ణాతులని వారినిగురించి ఆంధ్ర పురాణంలో కూడ వివరించుట జరిగినదని అట్టి శిష్టువారి కుటుంబానికి చెందిన శ్రీ రామ శాస్త్రిగారికి నా చేతులమీదుగా సన్మానము జరిపే భాగ్యము లభించుట నిజముగా నా పూర్వజన్మ సుకృతమని పేర్కొన్నారు.

శాస్త్రిగారిని శ్రీ చేబియ్యం వెంకట్రామయ్యగారు కాశ్మీరుశాలువా మరియు అర్ధనూట పదహార్లతోను సత్కరించినారు. మిర్తిపాడు శ్రీమీరాదాసు, N.C. జ్యోత్స్నారాణి, ఉష, విజయభాను, పలువురు పెద్దలు, శాస్త్రిగారి శిష్యులు వారిని పూలమాలాంకృతులను చేసినారు.

త్యాగరాజ నారాయణదాస సేవా సమితి కార్యదర్శి శ్రీ బుగ్గా పాపయ్య శాస్త్రిగారు ప్రసంగించినారు.

ఈ ఉత్సవాల ముఖ్యకార్యకర్త శ్రీ నిమ్మలపూడి వీర్రాజు వందనసమర్పణతో ఆనాటి సభ ముగిసినది. అనంతరం గాన సభ జరిగినది.